శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక



దేశభాష లందుఁ దెలుఁగు లెస్స

| | |
|---|---|
| సంపుటము | సంచిక |
| ౮౫ | 3 |

# సంపాదకవర్గము

ప్రధాన సంపాదకులు :

శ్రీ కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. యల్.

సహాయసంపాదకులు :

"కవిమూర్ధన్య, కవి కంఠీరవ, శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

"భాషాప్రవీణ" శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.

"వ్యాకరణవిద్యాభాషాప్రవీణ" శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

"విమర్శకాగ్రేసర" శ్రీ బండారు తమ్మయ్యగారు.

---

# విషయసూచిక

శ్రీ

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

(Journal of the Telugu Academy)

చందా సంవత్సరమునకు మూఁడు రూపాయలు

సంపుటము ౪౫ { దుర్ముఖ సంవత్సరము శ్రావణ–భాద్రపదమాసములు } సంచిక ౩

# మహాహరిహరదేవుఁడు

కవిమూర్ధన్య కాకరపర్తి కృష్ణశాస్త్రి

మ. చిటికల్ వేయుచు నావులించుచును లక్ష్మీప్రాణనాథుం డవి
స్ఫుటలీలన్ మునివిన్నపమ్ములకు నస్తుంకారము ల్వల్కఁ, ధూ
ర్జటి నాత్మం బరికించి కన్మొగిచి యాషాఢాదిమైకాదశిన్
పెనునిద్రావశవర్తి యయ్యెను పయోవారాశి శేషాహిపై.

౧

సీ. నిబిడద్రుమచ్ఛాయ నిద్రాణపాషాణ
మధ్య వైయాఘ్రచర్మంబుపైని
పద్మాసనమువైచి బాలకాలఫణీశ
పాశాపినద్ధకపర్దుఁ డగుచు
నవిచలోర్ధ్వశరీరయష్టియై నమితశోభ
యాంసుఁడై యుత్తానహస్తుఁ డగుచు
నచలితార్ధనిమీలితాక్షిత్రయీ నిస్స
రద్దృష్టి నాసికాగ్రమున నిలిపి

తే. గీ. నిర్వికల్పసమాధిలో నిర్విశేష
పరిహృతాజాండుఁ డగుచు నొక్కరుఁడె మిగిలి
యాత్మ నాత్మావలోకన మాచరించె
నచలతనయామణీమనోహరుఁడు హరుఁడు.

౨

మ. తనకేల్గాళులు సాగ, మేన్విఱిచి, కందమ్ముల్ విడన్, సౌఖశా
యసితుండై కయిదండ శంభుఁ డిడ, సర్పాధీశతల్పంబు డి

గ్గను వైకుంఠుఁడు ; పాయుగిల్లి తలపైఁ గేల్దోయిఁ గీలించుచున్
వనజాతాసనవాసవాదివిబుధుల్ వందించి జేపెట్టఁగన్.

౩

శా. ప్రాలేయాచలభూమిపాలతనయా భాస్వన్మహోస్థానిలో
నాళీకాసనతాడ్యమానమురజానల్పధ్వనుల్-భూత బే
తాళీపాదవిఘట్టనాట్టహాసముల్-దైత్యద్విషచ్చర్చరుల్
కైలాసోదరకందరావళులఁ దీగ ల్సాగి మార్మ్రోఁగగన్.

మ. నిటలాక్షుండు జటాచ్ఛటాతటహిమానీగోచిరంతస్స్రుతో
త్కటధారల్ డిగజాఱఁ, దూళగతులన్ గ్రైవేయమాలాస్థికల్
ఘటియింపన్, మకుటారటద్విజగంగాభంగముల్ రేఁగ, ను
ద్భటధాటిన్ నటియించెఁ గార్తికశశుంభత్పౌర్ణమాసీనిశిన్.

౪-౫

తే. గీ. అచలజామాత యధినాథుఁ డైనచోట
క్షేత్రపాలకుఁ డగును లక్ష్మీధవుండు
కమలనయనుఁ డధీశుఁ డై క్రాలుచోట
బాలశశిమౌళియే క్షేత్రపాలకుండు.

౬

మ. నవనీతమ్మును గాలకూటవిషముం గ్రాసించి, ప్రద్యుమ్ను సం
భవమున్ నాశ మొనర్చి చేలఁ గటి సంభావించి వర్జించి, ఘో
రవిషాహిన్ విశసించి తాల్చి, యిటు లేరా ! మాధవో మాధవై
క్యవిలాసస్థితి డాఁగురించెదవు దేవా ! భిన్నభిన్నక్రియన్.

౭

తే. గీ. హాలహాలసంజ్ఞోపరమార్థ మునిచి
రమరులు కపర్దసీమ నీహారకిరణు
గంగ చేగాని స్వాస్థ్యంబుఁ గనఁడు శివుఁడు
మాయ నెఱుఁగదు మాసర్వమంగళమ్మ.

మ. మును మామం దెగటార్చినట్టి చరితంబున్, గోపికాకామినీ
జనతాత్పర్యము, రాధికాదృఢపరిష్వంగాంతరార్థంబుఁ, గు
బ్జను లాలించిన పల్కు రానివిధ మర్యాదల్ గడున్ మ్రోఁగఁగా
వినియేయున్నది ; మా రమారమణి సాధ్వీలోకరత్నంబురా !

౯

మ. మును మామం దెగటార్చినట్టి కథనంబున్ శాంతిమద్దారుకా
వనికాపహానికులాంగనాభిగమనవ్యాపారపాండిత్యమున్
వినియే యున్నది—నీకపర్దకుటిలోనే డాఁచు గంగాంగనా
గనియే యున్నది—కాని—సాధ్వీసుమి మా కాత్యాయనీదేవి తాన్.

౧౦

మ. సకలంకం బగునీహృదంతరము నాశంకించియే మారమా
వికచాంభోజదళాక్షి నీహృదయమున్ వీడంగఁబోకుంట, వై
త్యాకసంహారనిమిషంబుఁ బూని ధర నీ వావిర్భవింపంగ—జా
నకియై నీ వెనువెంట రాఁ గినిసి కానం ద్రోసితే యామెతన్.

౧౧

శా. కామున్ గెల్చితినంచు నట్టహాసముం గావించుచున్ మాటికో
స్వామీ ! చేసె దకాండతాండవము ; నీవా ? కాముఁడా ? జేత నీ
సామే నెన్నఁగఁగూడ వీడని మహాశైలేంద్రసంజాతయే
నీమాటల్ పెనుబూటకంబు లనుచున్ తెల్లంబుఁ గావింపదే !

౧౨

మ. ఖరమో ధేనువొ గాలిమో యమళవృక్షమ్మో శిలావర్షమో
యురగమ్మో పిశితాశనీవిషవిలిప్తోరోజమో లిప్తలో
హరియింపంగల దేహమొకండయిన నిన్నబ్జాక్ష ! మా రుక్మిణీ
కరపీడోత్సవభావిభాగ్యవిధి నిన్ గాపాడె ముమ్మాటికిన్.

౧౩

క. మ్రింగిన హాలాహలము, భు
జంగమఫూత్కృతిపత ద్విషం బెబ్బంగిన్

భంగించు ? సర్వమంగళ
మంగళసూత్రైకమహిమ మనుపఁగ నిన్నున్.

౧౪

ఉ. పేరును లేని యొక్కరుఁడు, డోకించుకయుం గదలంగ లే, డనా
కారుఁ, డనామకుం, డఖిలకర్మవిదూరుఁ, డటంచు సత్కవుల్
సారె కనుత్తమోక్తితతులన్ నినుఁగూర్చి వచించుటే క్రుధా
కారణమేమొ ! నీసుదతి గాంచదు మమ్ము రమామనోహరా !

౧౫

మ. సరహాస్యం బగునాత్మతత్త్వసుధ నాస్వాదించితిన్, కావ్యముల్
పరికల్పించితిఁ బ్రౌఢిమన్ రసికవిద్వాంసుల్ ప్రశంసింప-మేల్
బిరుదుల్ గొంటిని-ఘంటికాకటకముల్ వేయించుకొంటిన్ భవ
త్కరుణాలోకనసాంద్రచంద్రికలు సోకన్ మాధవోమాధవా !

౧౬

క. గ్రామము రామేశ్వరమె, బ
లీ ! మా దేవుండు రామలింగేశ్వరుడే
మా మది హరిహరభేదం
బేమాత్రంబేని సోకునే యెన్నటికిన్.

౧౭

చ. కరివదనుండు మా హరుని గాదిలిపట్టియె, యావిరించి మా
హరికిఁ గుమారుఁడే, మఱియు నర్మిలినోడలె పల్కుచౌన, యిం
దరకు నమస్కరింపవలెనా ? కరుణావరుణాలయుండు మా
హరిహరుఁ డొక్కఁడే యొసఁగడా ? కడు వేడక యే యభీష్టముల్.

౧౮

తే. గీ. అతనువీరకుమారుఁ డబ్జాంబకుండు
సితమనోహర దేహుండు శ్రీధరుండు
పరిధృతాహీనమణిహారభాసురుండు
మమ్ముఁ గరుణించు సతతంబు మాధవుండు.

౧౯

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# రససిద్ధాంతము

శ్రీ యస్వీ జోగారావు

రసస్వరూపము :

తాత్త్వికుఁడు తన దారిని 'ఆనందో బ్రహ్మేతి' అని దేని నను చున్నాఁడో, దానినే యింకొక సోదరఋషి అనఁగా-కవి 'రసో వై సః' అనుచున్నాఁడు. విగళితవేద్యాంతరత్వసాదృశ్యము కారణముగాఁ గావ్యగతరసానందమును బ్రహ్మానందసబ్రహ్మచారిగాఁ బెద్దలు పేర్కొనిరి. బ్రహ్మానందము సిద్ధము. కావ్యానందము వాసనాసిద్ధము. బ్రహ్మానంద మఖండ వాక్యార్థబోధనవలన ననుభూతము. కావ్యానందము కావ్యగతశబ్దార్థానుగతివలన ననుభూతము. బ్రహ్మానంద మజ్ఞానాంశవారణమువలనఁ గలుగును. కావ్యానందము వ్యక్తిస్వరూప తాత్కాలికవిస్మృతివలనఁ గలుగును. 'రసప్రసంగము వేదములలోనే యున్నదన్న దానిప్రాచీనసమీచీనత్వముగూర్చి వేఱ చెప్పవలయునా? అది యుపనిషన్నిష్పన్న మైన నిర్వచనముప్రకారము జగత్ప్రధానసారభూతము. మహానిమానసముచ్యమానము నైనది. లౌకికముగా ననఁగా-ఆలంకారికార్థమున నది కావ్యానందపర్యవసాయి యగు పదార్థము. ప్రప్రథమమున నీ రససిద్ధాంతమును దృశ్యకావ్యములపట్ల సమన్వయము చేసినవాఁ డాదిమనాట్యాచార్యుఁడు భరతమహర్షి.

భరతసూక్తి :

'విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః' అని. ఇది సూత్రప్రాయముగా నున్నది. ఆ త్రిపుటియొక్క- పరస్పరసంబంధముగాని, వానినుండి రసము నిష్పత్తి యగు క్రమముగాని భరతాచార్యునిచే వివరింపఁబడలేదు. అందుచే నర్వాచీనాలంకారికులలో నభిప్రాయ

భేదముల కవకాశ మిచ్చినది. అట్టివారిలో భట్టలోల్లటాదులు ముఖ్యులు- ప్రపానకరసాయనన్యాయమున విభావాదులచే నాస్వీయమానస్వాదుత్వము గలిగి, లవణసముద్రమువలె స్థిరవ్యక్తిత్వము గల స్థాయిభావమే రసము-రసము యన్నిష్ఠము ? అనునదే ప్రశ్న.

ఉత్పత్తివాదము :

భట్టలోల్లటునిమతమున రస మనుకార్యనిష్ఠము. 1. విభావములు ఉత్పాదకములు (రామాదులు), 2. అనుభావములు గమకములు (కటాక్షాదులు), 3. సంచారిభావములు పోషకములు (ఔత్సుక్యాదులు) ఇఁక సంయోగ మనఁగా-రస మనునది వరుసగాఁ దైవానితోఁ గలిసి యుత్పాద్యము. గమ్యము పోష్యము నగుట-సామాజికునియందు నాయకనిష్ఠ మగు రసము స్ఫురించుట యని నిష్కృష్టార్థము. కాని యందలి లోపము రసము రామాదులకే సంబంధించినదైన సామాజికున కా చమత్కారము కలుగ దనుట-(నిష్పత్తి=ఉత్పత్తి.)

అనుమితివాదము :

శ్రీశంకుకునిమతమున రసము నటనిష్ఠము. నటునియభినూనయాదికమువలన సామాజికుఁడు రసము ననుమానించును. అనఁగా నూహించును. పొగ యున్న సెగయు నుండు నన్నఁ దార్కిక వ్యాప్తిమూలము. ఇట సంయోగమునకు జ్ఞాప్యజ్ఞాపకభావ మని యర్థము. (నిష్పత్తి- అనుమితి లేక జ్ఞప్తి.) జ్ఞాపకములైన విభావాదులవలన స్థాయిభావము జ్ఞాప్యమై రస మగును-కాని ప్రత్యక్షజ్ఞాపకముచేతనే రసము సువ్యక్తమగుచుండ దానికంటె నవర మగు ననుమానజ్ఞాన మవసర మేమి ?

భుక్తివాదము :

భట్టనాయకునిమతమున రసము సామాజికనిష్ఠమే. తప్పటడుగులు వేసినను గమ్యస్థానము చేరి పేరు సార్థకము చేసికొనినాఁడు- అతనివాదసారాంశము :- విభావాదులవలనఁగదా రసోత్పత్తి. రామా

దులు సామాజికునకు విభావాదులు కాదుగదా! మఱి రసోత్పత్తి యెట్లు? అనఁగా ననుకార్యులలౌకికులుగదా! తదాశ్రిత మగు రసము-అలౌకికమే. భావకత్వ మను నొక శాబ్దికవ్యాపారమువలన విభావాదులందలి రామత్వాదులు పోయి, నాయకత్వాదులుమాత్రమే మిగిలి తన్నాయకాదులతో సామాజికున కభేదభావన మేర్పడును. ఇదియే సాధారణీకరణము. తదుపరి భోజకత్వ మను వ్యాపారాంతరమువలన నట్లు సాధారణీకృతము లైన రత్యాదిస్థాయులు రసస్వరూపము దాల్చి సామాజికునిచే భుజ్యమానము లగునఁట! ఈ మతమున సంయోగ పదమునకు భావకత్వ మని యర్థము. నిష్పత్తి యనఁగా భుక్తి లేక యాస్వాద మని యర్థము. ఇందు విభావాదులు భోజకములు. (భోగ కారకములు) రసము భోజ్యము. దీనిని భుక్తివాద మందురు. ఇందలి లోపము-ఉపరినుదాహృతము లైన శబ్దవ్యాపారములు రెండును గల్పితములు. ప్రామాణికములు గావు. అనుభూతి చేతనధర్మము. చైతన్యము వాసనామూలకము. (మనస్తత్త్వశాస్త్రము ప్రమాణము). అట్టిచో సామాజికుని వాసనాప్రసక్తియే మాత్రము నిందు లేదు. ఆనందవర్ధనాచార్యుని ధ్వన్యాలోకమున రసము వ్యంగ్యముగా నిరూపింపఁబడినది. ఆ రసధ్వనిసిద్ధాంత మాధారము చేసికొని తద్వ్యాఖ్యాత యగు నభినవగుప్తపాదుఁడు పైవాదముల నెదురఁగొట్టెను. అతనిమతమునను భట్టనాయకుఁడు చెప్పినట్లు రసము సామాజికనిష్ఠమే. తదలౌకికత్వ మంగీకార్యమే. సాధారణీకరణముమాత్రము, భావకత్వ వ్యాపారాశ్రితము కాక విభావాదిసంబంధి. దానివలన నగు రసానుభూతికి సహృదయుఁ డైన సామాజికుని సంస్కారాధిష్ఠాత మైన వాసనాబలమే మూలాధారము. ఆంగ్లేయు లన్నట్లుసానుభూతి (Sympathy) కాదు. మఱి? తాదాత్మ్యము (Identify) ఇది సిద్ధాంతము. కేవల భావప్రధానము లగు కావ్యములందుఁ దదంగముగామాత్రమే భాసించు

నవు డలంకారముగాఁ బరిగణింపఁబడుచున్నది. (రసవదలంకారము) అనఁగాఁ బ్రతీయమానరసభావము.

విభావాదులస్వరూపము – కావ్యమున వానిప్రసక్తి :

సహృదయుఁ డొకఁడు సత్కావ్య మొండు చదివి యెంత రస వంతముగా నున్నది! అనును. రసము సామాజికనిష్ఠ మను సిద్ధాంత ముండఁగా సహృదయహృదయము రసవంతము కావలెఁగాని కావ్య మె ట్లగును? అనఁగా రసవత్త్వము వాసనారూపముగఁ బాఠకునియందే యున్నది. ఆ వాసన ననుభూతిగాఁ బరిణమింపఁ జేయఁగల ప్రక్రియ యంతయు ననఁగా రసజనకతమాత్రమే కావ్యమునం దున్నది. 'అగ్ని ర్మాణవకః' అనుచోట నగ్నియే మాణవకుఁడు కాదుగదా! అగ్ని వంటివాఁడు మాణవకుఁ డని యౌపచారికముగా నె ట్లర్థముఁ జెప్పుకొను చుంటిమో యట్లే యిచ్చటఁగూడ రసవంత మనఁగా రసజనక సామగ్రిమంత మని యర్థము చెప్పుకొనవలెను.

రసజనకప్రక్రియ :

"విభావానుభావవ్యభిచారి సంయోగా ద్రసనిష్పత్తిః" అని భరత సూత్రము.

1. రత్యాదిస్థాయిభావములు దేనిచే మిక్కిలి భావింపఁబడు చున్నవో యవి భావాభిజ్ఞులచే విభావము లని చెప్పఁబడుచున్నవి. విభావము ద్విధా విభాజ్యము–

౧. ఆలంబనవిభావము–శకుంతలాదుష్యంతాదులు.

౨. ఉద్దీపనవిభావము–చాంద్రీచందనమలయమారుతాదులు.

2. 'అనుపశ్చాత్ భావః, ఉత్పత్తి ర్యేషాం' అనుభావయంతీతి వా' అని అనుభావపదవ్యుత్పత్తి. స్థాయిభావమున కనంతరము జనించి వాని ననుభవింపఁజేయుటవలన ననుభావపదము సార్థకము కటాక్షా

దులేకాక స్తంభప్రళయరోమాంచాదిసాత్త్వికభావములు ననుభావములే. అనుభావము లంగజములు.

3. 'విశేషేణ అభితః చరంతీతి వ్యభిచారిణః' అని వ్యుత్పత్తి. వీనికే సంచారు లనియు (సమ్యక్ చారయంతి) పేరు. ఇవి రత్యాది స్థాయులందుఁ బ్రాదుర్భావతిరోభావము లందుచుండును. అందుచేతనే వీనికి సముద్రతరంగములతో సామ్యమును గలదు. ఇవి మనసిజములు—నిర్వేదాదులు.

ఈ విభావాదులవలనఁ గలిగిన స్థాయిభావమున వ్యభిచారాదులు లయము చెంది దానిని వృద్ధిపఱచి (నదులు—సముద్రమును వలెనే) రసత్వమును సిద్ధపఱచుచున్నవి.

రసరసమునకు నీ విభావాదు లొక్కొక్క తీరున నుండును. ఆనందవర్ధనాదిప్రామాణికాలంకారికులమతమున రసము వ్యంగ్యము. అనఁగా నభిధావ్యాపారమున వెంటనే నైఘంటుకార్థమును స్ఫురింపఁజేయు శబ్దమువంటిది గాదు రసము. పలుమాఱు 'శృంగారము, శృంగార' మని తన్నామస్మరణ చేసినంతమాత్రమున నా రసము హృదయగోచరము కాదు. అది అనుభూయమాన మగుటకు విభావాదులే మూలకారణములు.

భట్టలోల్లటుఁడు లౌకికరత్యాదులకుఁ గారణము లగువానిని గూడ విభావాదు లనియే వ్యవహరించెను. అభినవగుప్తుఁడు లౌకికములు కారణము లనియు, అలౌకికములు (కావ్యగతములు) విభావము లనియు వ్యవహరించెను. అనఁగాఁ గావ్యపరిభాషలోఁ గారణకార్యసహకారులే విభావానుభావవ్యభిచారు లను సంజ్ఞల వ్యవహృతము లగును. విభావాదు లలౌకికము లనఁగా: కావ్యగతపాత్రలు కేవలము శకుంతలా—దుష్యంతులే కానక్కఱలేదు. సామాజికునివలెనే సామాన్యులైన యొక కళాశాల విద్యార్థినీ విద్యార్థులును గావచ్చును.

ఉద్దీపనవిభావమున కైన రంగప్రసాధన ముద్యానమే కానక్కఱలేదు. సామాజికుని యింటివంటి యొక మందిరమును గావచ్చును. వారి భావ ప్రకటనము సామాన్యమానవస్వభావసన్నిహితమే కావచ్చును. అం తయు లౌకికమే యని యనిపించవచ్చును. కాని యది లౌకికత్వా భాసమే. అంతయు ననుకరణ, నటన. ఆ సంగతి తెలిసియున్నను సామాన్యుఁడు నాట్యమందిరమునఁ బ్రవేశించుచున్నాఁడు. సామా జికుఁ డగుచున్నాఁడు. కానున్న లోకములోఁ దన కంట్లకట్టెదుటఁ దన యిరుగుపొరుగుల జరుగునట్టి కథలనే నాటకమునెడ నున్నంతకౌతుక ముతోఁ జూమనా! తెలిసి డబ్బిచ్చి మోసమును గొనుకొనుచున్నాఁడు- ఎంత బాగుగ మోసపడిన నంత యానందానుభవము-తదుపరి తెర తీయఁగనే తన బాహ్యలౌకికత్వధ్యాసను విడిచి, నాటకమే లోక మన్న ట్లుగా వేషచేష్టాదులవలనఁ దన కంటె విలక్షణముగా నున్న యతి మానుషామానుషపాత్రలతో సాధారణీకరణము నొంది, యుద్దీపనా దులవలన నుద్దిష్టుఁడై సంస్కార మధ్యస్థానముగాఁ గల ప్రకృతరసవాస నలు భావగ్రంథి విచ్చి, బయలుదేఱి, తదితర సజాతీయవిజాతీయవికార ములవలనఁ జలింపని చిత్తస్థితిలో స్తిమితపడి, రసస్వరూపమును దాల్చి యానంద మనుగమ్య మైనంతనే సామాజికుఁడు చంద్రమతిదుఃఖఘట్ట మును దిలకించియున్నను సమీపమున నున్న స్నేహితునితో 'ఎంత బాగా ఏడ్పించెరా' అనును. "బాగా ఏడవడ మేమిటి నా మొహం!" అని అనుకొనఁడు. అదే యలౌకికత్వము. ఆంగ్లవిమర్శకు లన్నట్లు (Distance)- అదే రసరహస్యము. దానిని ప్రేక్షకప్రభువునకు నివే దించు గూఢచారులే విభావాదులు. శ్రవ్యకావ్యములకును నిట్లే, ప్రద ర్శనవేళవచ్చు సాక్షాత్కృతి లేకపోవుఁగాక, కాని సమన్వయించుకొన వచ్చును.

"శబ్దోపహితరూపాం స్తాన్ బుద్ధే ర్విషయతాం గతాన్
ప్రత్యక్షానివ కంసాదీన్ సాధనత్వేన మన్యతే॥"
— భర్తృహరి

రససంఖ్యావిచారము :

ఈ రసరాద్ధాంతము నాఁటినాట్యాచార్యుని కాలమునుండి నేఁటి వాఁక పండితుల గుండెలు తడివి చూచిన యొక మహావాదము.

భరతాచార్యుఁడు నాట్యశాస్త్రమున-
"శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకాః
బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః॥
రతి ర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా
జుగుప్సా విస్మయ శ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః"॥

అని యష్టరసములను వానిస్థాయిభావములనుమాత్రము పేర్కొనెను. వీనిని రసములు కా వనుటకు వీలులేదుగాని మఱికొన్నిటి నేల గ్రహింపరా దని కొందఱివాదము. అట్లు క్రొత్తగాఁ బ్రతిపాదింపఁబడిన వానిలోఁ బ్రధానము శాంతము.

వాసుకికోహాలు లనువారీ వాదమును లేవఁదీసి రందురు. కాని వారిప్రమాణవాక్యములు లభింపలేదు. మొట్టమొదటగా భట్టోద్భటుని కావ్యాలంకారసంగ్రహమున శాంతరసప్రసక్తి కన్పట్టును. అతఁడే పై నాట్యశాస్త్రశ్లోకమున సవరణ ప్రవేశపెట్టెను. 1. 'సంజ్ఞౌ చేత్యష్టౌ' అనుచోట 'శాంతాశ్చ నవ' యనియు 2. 'విస్మయ శ్చేతి' అను చోట 'విస్మయశమాః' అనియు మార్చెను. శాంతమును రసముగా నంగీకరించినవారిలో మరల తత్స్థాయిభావమునుగూర్చి యభిప్రాయ భేదము గలదు. 'శమ' మని కొందఱు, 'నిర్వేద' మని కొందఱు, 'సమ్యక్ జ్ఞాన' మని కొందఱు, 'నిర్విశేషచిత్తవృత్తి' యని కొందఱును-ఇందు శమనిర్వేదములుమాత్రము భరతాచార్యునిచే స్థలాంతరమునఁ బ్రస

క్తము లయ్యెను. అది చూచియే యభినవగుప్తాదులు 'మునినాఽప్యంగీక్రియతే క్వచిచ్ఛమ ఇతి వదతా' అని తమతమవాదములను బల పఱచుకొనిరి. కాని దశరూపకకర్త యగు ధనంజయుఁడు 'శమ మితి కేచి త్ప్రాహుః పుష్టి ర్నాట్యేషు నైతస్య' అనఁగాఁ దద్వ్యాఖ్యాత యగు ధనికుఁడు శ్రవ్యకావ్యమునమాత్రము శాంతము చెల్లుబడి కావచ్చు నని వ్యాఖ్యానముచేసెను. ( Interpreted ). చంద్రికా కారుఁడు దృశ్యకావ్యముననుం డవచ్చు ననెనుగాని యంగప్రాయత్వ మునే విధించెను-శమమునకు సంచార్యాదులుకూడ నుండు నని దర్పణ కారుఁడు కావ్యనాటకముల రెంటను బ్రయోగయోగ్యమే యని సిద్ధాంతీకరించెను. కాణేపండితాదులవ్రాఁతలవలనఁ దెలియనగునది-ఆనందవర్ధ నాభినవగుప్తభట్టతౌతాదులమతమున శాంత మొక్కటే మోక్షనాయకము గాన నదియే యేకైకరసమఁట ! ఇది అతివాదము. దృశ్యశ్రవ్య కావ్యములరెంటను, తదితరరసములవలె నిదియు నొక రస మనుటయే సిద్ధాంతము. ప్రబోధచంద్రోదయభారతాదు లిందుల కుదాహరణ ములు. రుద్రటుఁడు 'దశమో రసః ప్రేయాన్' అనియు దాని స్థాయి భావము స్నేహ మనియు నొడివెను. కాని దీనికి వ్యభిచారిభావాదులు లేవు కనుక నీ ప్రేయోరసవాదము ప్రాయోవాదమే.

భరతాచార్యుఁడు రసవర్ణోచ్చారణసందర్భమున వాత్సల్యపద మును వాడియుండుటచే దర్పణకారుఁడు 'అథ మునీంద్రసమ్మతో వత్సలో రసః' అని వత్సలరసవాదమును లేవఁదీసి ప్రేమయుక్త మగు రతి స్థాయి యనియు, భ్రాతృపుత్రాదు లాలంబన మనియు, ఆలింగనాది తదీయచేష్టావిశేషము లనుభావము లనియు, అనిష్టశంకాహర్షగర్వా దులు వ్యభిచారిభావము లనియు నిరూపించుటకుఁ బ్రయత్నించెను.

'పృథగేవ భక్తి రసరాట్సవిస్తరే ణోచ్యతే మధురః' అని భక్తిని రసముగాఁ బ్రతిపాదించినవారిలోఁ బ్రథముఁడు రూపగోస్వామి.

మధుసూదనసరస్వతి దానిని సాంగోపాంగముగా నిరూపించెను. దేవతా విషయిక మగు రతి దానిస్థాయి యఁట. అనఁగా, ఉదాత్తమైన శృంగారమే యన్నమాట. భాగవతము, క్షేత్రయ మువ్వగోపాలపదములు మొదలగునవి యిందుల కుదాహరణములు కాఁగలవు.

భానుదత్తుఁడు మాయారసవాదము నుపపాదించెను. ఇట మాయాశబ్దమునకు దృశ్యప్రపంచానుభూతికి హేతువైన మాయ యని మాత్రమే యర్థము. లోకములో మోసము- ఇత్యాద్యర్థములలో వాడఁబడు 'మాయ' కాదు. 'మాయావచ్ఛిన్నచైతన్యము', 'ఈశ్వరుఁడు' ఇత్యాదిపదములసందర్భమున వాడఁబడు మాయయే దీని యర్థము.

ఇట్లు పూర్వ మంతో యింతో యలంకారశాస్త్రవిద్యానికషాయితధిషణుఁడైన పండితుఁ డెల్ల ఏదో యొకవాదమును లేవఁదీయుచు వచ్చెను. వారివాదములు స్వప్రతిభాప్రకటనార్థమే కాని సహృదయహృదయంగమములు కావు. ఆదినుండియు మనయలంకారశాస్త్రము తార్కికులచేతిమీఁదుగా నడచుచున్నది. అది యొకవిధముగాఁ బ్రక్రియాప్రకృష్టత్వప్రతిష్ఠాపనమునకు మంచిదే కాని యుక్తిమాత్రనిపుణులు, చమత్కారపరాయణులు నగువారి మిథ్యావాదములచే యథార్థశాస్త్రహృదయ మగాధమైపోయినది.

అసలీ 'అనంతో వై రసాః' అనువాదమును మొట్టమొదట భట్టలోల్లటుఁడు లేవఁదీసెను. ఆదిలోనే హంసపాదన్నట్లు రసము యన్నిష్ఠ మను విచారణలోనే యుత్పత్తివాదోత్పాదకుఁడై యతఁడపమార్గమును బట్టెను. అభినవగుప్తపాదుఁ డీ వాదము లన్నింటికిని సమాధి కట్టెను. ఆచార్యునియష్టకమువినా శాంతేతరము లన్నియు భావమాత్రము లని కొట్టిపాఱవేసెను. అనఁగా రసములు తొమ్మిది యని సిద్ధాంత మేర్పడును. 'నవరసము' లని నాఁటికి నేఁటికి జగత్ప్ర

సిద్ధియుఁ గలదు. కాని యీ సందర్భమున రసగంగాధరమందలి వక్కాణ- ధనంజయ ధనికాదుల పూర్వవాదములనే పురస్కరించుకొనిన దయ్యును, ఆలంకారికులం దతినవ్యుఁడు, పరమప్రామాణికుఁడు నైన జగన్నాథ పండితరాయ లాచార్యహృదయము నాకళించుకొని యన్న ప్రౌఢోక్తి యగుటచే గమనింపఁదగినది.

> "శాంతస్య శమసాధ్యత్వా న్నటే చ తదసంభవాత్
> అష్టావేవ రసా నాట్యే న శాంత స్తత్ర యుజ్యతే॥"

శమము స్థాయిగా శాంతమును సాధింపవలె. ప్రాపంచికవ్యవహార వ్యాపృతుఁ డైన నటునకు శమ మసంభవము. కాఁబట్టి నాట్యములో నెనిమిదే రసాలు. శాంతమున కం దవకాశము లేదు. భరతాచార్యుఁ డేతదుద్దేశపురస్సరముగనే శాంతరసప్రసక్తి విడిచియుండును. నాట్య శాస్త్రమున స్థలాంతరమున నింనుక ప్రసక్తి వచ్చినను నంతమాత్ర మున శాంతమును రసాంతరముగా నంగీకరించికాదు. 'క్వచి చ్ఛమః' అన్నంతమాత్రమున శాంతమునకు రసత్వము నంగీకరించినాఁ డన్నచో నదే శ్లోకమున 'క్వచి ద్ధర్మః, క్వచి త్క్రీడా, క్వచి దర్థః' అనుచోట వానినికూడ రసములుగా నేల ప్రపంచింపరాదు ? అను ప్రశ్న వచ్చును. ఇఁకఁ ప్రబోధచంద్రోదయాదిలక్ష్యకోశ మున్న దన్నచో నది చదివి కాదు. ప్రదర్శనవేళ నెట్లు రక్తికట్టునో చూడవలయును. అందు సాంకే తికత (Symbolic treatment) యుండుటచేఁ గొంతమట్టుకు సామా జికామోదము నందవచ్చునేమోకాని శాంతకేవలమైన వాతావర ణము (atmosphere) తో ప్రదర్శన సాగలేదు. సాగినను సామాజిక హృదయము తదున్ముఖముగా స్పందించదు. అందుచే రసము లెన్ని యనఁగా దృశ్యకావ్యమున భరతాచార్యుఁడు చెప్పిన ట్లెనిమిది, శ్రవ్య కావ్యమున శాంతముతోఁ గలిసి తొమ్మిది యని చెప్పుటయే సమంజస మగును. పండితరాజువక్కాణ కన్యథాత్వము లేదు.

అనంతవాదము, అష్టనవవాదములు నైపోయినవి. ఇఁక, ఐక్య వాద మనున దొకటి కలదు. రస మానందరూపము కదా, ఆనంద మవ్యవచ్ఛిన్నము కదా, అట్టిచో ఆనందమున లేని భేదము తత్పర్యవసాయి యగు రసమం దేల యుండవలెను? అని పృచ్ఛ. 'శృంగార ఏవ ఏకో రసః' అని భోజదేవుఁడును, 'ఏకో రసః కరుణ ఏవ' అని భవభూతియు, అద్భుతమే ఏకైకరస మని నారాయణుఁడును వక్కాణించిరి. ఆ యావాదములనే కాదస లాయారసతత్త్వములనే అనుసంధించి పరిశీలించినచో అంతమందు రసములన్నిఁట కూటస్థమగు స్వాదాత్మయొక్కటే అని తేలును. అదే కవి కర్ణపూరగోస్వామి ప్రతిపాదించిన స్ఫటికోపమ్యావాదము ప్రకారము ఉపాధిభేదమువలన వైవిధ్య దాల్చినది యని సమాధానము.



# నా స్వామి

శ్రీ. శే. గొట్టుముక్కల రామకృష్ణశాస్త్రి గారు.

శ్రీమద్వేదశిఖాంతరప్రథితనిస్సీమప్రభావోన్నతా !
భూమీజాహృదయాబ్జభాస్కర ! నవాంభోదప్రభా ! పూతస
న్నామా ! భాస్కరవంశవర్ధన ! జగన్నాథా ! దయాసింధు ! సు
త్రామాద్యర్చిత! దీనబంధు! పరమాత్మా! పాహిమాంపాహిమాం.

సీతాలక్ష్మణక్లృప్తపార్శ్వము పదశ్రీనిత్యసంసేవన
ప్రీతప్రీతసమీరనందన మతంద్రీభూతతూణీధనుః
స్ఫీతాపీనభుజాగ్రపీఠము జగద్విఖ్యాత మాంత్రమ్ము ప్రో
ద్గీతం బైనభవత్స్వరూపము లసత్తేజం బుపాసించెదన్.

కలితస్వర్ణకిరీటకోటివిలసద్గారుత్మతేంద్రోపలా
మలమాణిక్యధగద్ధగత్ప్రభ లసామాన్యంబుగా మింట ను
జ్జ్వలమాహేంద్రధనుఃకలాపము రచింపన్ సత్కృపాసానముల్
సెలఁగ న్నిల్చు ఘనస్వరూపము నుపాసింతున్ సదాకాలమున్.

లీలాభంజితశైవచాప మఖిలోలిప్తాంగరాగంబు నా
నాలంకారయుతంబు జానుతలపర్యంతంబు ధర్మద్విష
త్కాలవ్యాళము బాహుదండము జగత్కల్యాణధారేయమై
క్రాల న్మోహనమూర్తియై నిలుచు లోకస్వామిని న్గొల్చెదన్.

గర్వోన్మత్తదశాస్యకంఠదశకాకస్మాద్వినిర్మూలనా
ఖర్వప్రస్ఫుటవిక్రమంబు భుజయుగ్మంబున్న తాయామమై
సర్వాపత్పరిరక్షణోద్గ్రథితదీక్షాకంకణోపేతమై
పర్వన్ నిల్చిన వీరమూర్తిని మహేష్వాసున్ మనం గొల్చెదన్.

# అహల్యా-శాపమోక్షము

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

మనసుగఁ గర్త్రభీప్సితతమమ్ముగఁ గర్మపలాశహోమమున్
దనవిశిఖాగ్నిసల్పి, గురుధర్మము నిర్వహణ మ్మొనర్చి యా
జనకసుతాస్వయంవరము సాఁకుగ సానుజుఁడై, గురూద్వహున్
మునుకొని రామమూర్తి యను మోదమునం జనె దండకాటవిన్.

చనునప్పుడు వన్యము లగు
వనోకహలతావ్రాతెల్ల నడిగి తెలియుచున్
దనకులగురుఁడు వచింపఁగ
వినుచును వినఁదగిన కథల విధముల నెల్లన్.

మలదకరూశదేశములమార్గము పట్టిరి, తత్ప్రదేశముల్
కొలువులు బొమ్మరక్కసులకున్ గపికోఁతలు జంతుకోటికిన్
నెలవులుఁ గంటకావృతవినిందితపుష్పలవృక్షగుల్మినీ
వలులకు, మిత్తిసత్తిక నివాసము లౌటను నిర్జనంబులున్
పలపల వీఁచు తెమ్మెరలు భంగురతచ్ఛలకాకపక్షముల్
జలజల రేఁప వానిఁ జెవిచక్కికి నొక్కుచు రామలక్ష్మణుల్
కలకలలాడు మోమునఁ జొకారపుఁగన్నులఁ గౌశికోత్తమున్
వలగొని 'స్వామి! యియ్యెడ జనస్థలు లిట్లుగ నున్న వేలొకో?

కాకపేయము లిటఁ దటాకములు నదులు
పాఁడిపంటల కిచటు నిప్పచ్చరంబు
బూఁజులను బ్రుంగి యొక్కకాఁపురము లేక
కాపురము లయ్యె నివి యేమికారణమున?

శాపమ్మందెను వృత్రహంత యయి సుత్రాముండు మున్ బ్రహ్మహ
త్యాపాపమ్మునఁ జేసి; తత్పురితమిస్థానంబునన్ క్షాళితం

బై సింపొందినకారణమ్మెనను రామా ! యిప్పి యువ్వెత్తుగాఁ
బాపాక్రాంతము లయ్యె ; వేఱొకమహాపద్భార మిప్పిళ్లకున్.

అనుచు శతానందునిచే
జనతి వడిన శాపగాథ సనిచక్కఁగ నా
ముని వినిచి తాటకాసం
హాననమునకుఁ బ్రోత్సహించె నారఘువీరున్.

గురుపులయాన మీఱు టనుకోకుఁడు సందియ మయ్యె సామి ! యే
స్త్రీఱ నొకయాఁడుదానిని వధించుట మారఘువంశమంతకుం
దఱుఁగనిమచ్చ కాఁగలదొ ? తాపసవర్య ! మహాత్రపాభరం
బురవడి గుండెలో మెఱయుచున్నది యియ్యది తీవ్రశల్యమై.

చాతుర్వర్ణ్యము గావ లోకహితమున్ సాధింపఁగాఁ బూను త
ద్రీతుల్ ధర్మ్యము లెట్టివిన్, మదిని సందేహింపరా దిద్ది, నీ
చేతం దీఱఁగ దీని కున్న ; దదె వచ్చెం దుర్మి తూటాడ కీ
కాతర్యం బది యేల ? దాశరథి ! చక్కంజేయు మీరక్కసిన్.

రారా నారఘువంశభూపతికిశోరా ! రామ ! రా రార, యీ
తీరుల్ గాంచర, వచ్చి మీఁదఁబడె 'హాఫ్థి, హుం ఫటుస్వాహా' లే
లేరా యెక్కడరా ధనుస్సు సిదె వాలెన్ మీఁద నంచుండఁగా
ఘోరాకారమహాట్టహాసభయదక్రూరప్రకారంబులన్.

బారలు బాచుచుఁ దాఁ బెక
తేరన్ రాఘవులఁ బట్టి తివఁబూనఁగ నా ,
ఘోరపిశాచిని కౌణప
నారిం గారించె నొక్కనారాచమునన్.

తగిలినరామబాణమునఁ దాటక రూపము వీడి హానికాం
తగఁ బొలుపంది యాజనకి "ధన్యతఁ గంటిని రామచంద్ర ! నీ
యగణిత మైనసత్కృప దయానిధి ! దాశరథీ !" యటంచు నా
మగువ తగ న్నుతించి పెఱిమన్ మునిపాదము లంటి మ్రొక్కుచున్,

తెలివిఁ గాంచితి బ్రహ్మవాదీ! నమోస్తు
తెగెను నాశాప మో త్రివేదీ! నమోస్తు
అనుచు మునిఁ గొనియాడి యూజనతి వారి
సరణి వెంటాడి గౌతమాశ్రమము చేరె.
విచ్చేయు నతిథివర్గము
నచ్చపుగౌరవమునన్ శతానందుండున్
మెచ్చుచు గౌతమమునియును
దెచ్చిరి తమపర్ణకుటికిఁ దేఁకువ మెఱయన్.
రాముపదపద్మపావనరజ మహల్య
ఱాప్రతిమ సోఁక నడిపించె రాము నపుడు
గాధితనయుండు; సత్య మకారణముగ
బంధుజను లౌదురే కదా పరమమునులు.
తోడనె ఱాతిబొమ్మకు మృదుత్వము చేకురెఁ గల్గెఁ గంపమున్
నాడులుఁ జూపులున్ మొలిచె, నస్పినరీతిగ రూపురేకలున్
గూడెను, బొందె నూరుపులుఁ గోమలి యామఁ ద్రపాభరమ్మునన్
బోడిమితో నహల్య కచమున్ సవరించుచు నిల్చె ముంగిటన్.
అరుణకిరణసంపర్కమ్ము నంది, రేకు
రేకుచొప్పున విడినవారిజముకరణి
రామపదరజస్సక్తిచే రాతిబొమ్మ
నాతిగా మాఱె నెల్ల రానంద మంద.
చూచెన్ గౌతముఁ డాత్మపత్నిని ముదస్రుల్ కన్నుల స్నిండఁగాఁ
జూచెం గౌశికుఁ డెంతచేసితి నటంచున్ మెచ్చుకొన్నట్లుగాఁ
జూచెన్ రాఘవుఁ డన్యదార యనుకొంచున్ భీతభీతంబుగాఁ
జూచెం గోడలునుం ద్రపాభరితచక్షుర్భుగ్నశీర్షంబుగా.
చూచెం బుత్రుఁడు భక్తిభావభరసంక్షుబ్ధాంతరంగుండుగాఁ
జూచెం బ్రేక్షకమౌనిబృంద మట చూచూత్కారరమ్యంబుగన్

వీఁచెం జల్లఁగ మందమారుతము మన్నించెన్ వనీదేవతల్
పూఁచెం దీవ లహల్యరూపము యథాపూర్వంబుగా మాఱుటన్.

మృగతతికి గౌతమాశ్రమ
ఖగతతి కగతతికి మౌనికాంతాతతికిన్
మిగిలిన భృంగలతాతతి
కగణితముగ నయ్యెఁబో మహానంద మటన్.

ఇందఱును నిన్ని భంగుల నీక్షసేయ
నందఱిని భక్తినమ్రత నా యహల్య
కనులఁ గప్పుచుఁ దా నమస్కారపూర్వ
కముగ నుతియించి పతిపాదకమల మంటె.

వెన్నెల సుధాంశుతోఁ గూడువిధిని, మెఱపు
జలదమును జేరునట్లు లాజనతి స్వపతి
పదకమలమత్తభృంగియై కుదురుకొనియె
సతికిఁ బతికన్న వేఱుసద్గతియుఁ గలదె?

పూర్వజనిసంచితార్థానుభూతివలన
మనలు మౌనిదంపతుల నీ మాడ్కి నుద్ధ
రించి రాఘవులను నడపించికొనుచు
సాఁగె మిథిలకు గౌతమసంయమియును.

కల్యాణమూర్తు లగు నీ
కల్యాణాత్మకుల కెల్లకాలమును జగ
త్కల్యాణకరుఁడు శాశ్వత
కల్యాణుఁ డొసంగు నిత్యకల్యాణములన్.

# శ్రీమద్రామాయణము - మానవసత్త్వ ప్రతిష్ఠ

# పుత్రకామేష్టి

శ్రీ భమిడి సత్యనారాయణశర్మ.

ఇంతవఱకు శ్రీమద్రామాయణగ్రంథరచనమునుగూర్చియు, దశరథమహారాజుజీవితమునుగూర్చియు, మనము కొంత విమర్శించుకొని యున్నాము. అందుఁ దేలిన ముఖ్యాంశము లెవ్వి యన :—

(1) కామ మనునది యీశ్వరగత మైన యనంతశక్తులలో నొక విలక్షణబంధహేతు వగు శక్తి. "కామపూర్వో౽స్మ్యహం నృణాం" అని శ్రీనృసింహమూర్తి ప్రహ్లాదునితో ననెను. "ఖొరాన్" అను మహమ్మదీయమతగ్రంథమునందుఁగూడ నీ కామమును "ఇష్క్" అను పేరున నీ సృష్టికి మూలముగ నెన్నఁబడుచున్న దని "ఇస్లాం" మతస్థు లందురు.

(2) ఈ కామము వ్యసనముగ స్త్రీపురుషులయందు మాఱినచో నయ్యది వివిధదుఃఖహేతువై యనేకాపదలకు నిలయ మగును. దానిని సరియగు మార్గమున జాగరూకతతో నడిపింపఁగల ధీరుల కయ్యది "కామధేను"వై యనేకసౌఖ్యముల నొడఁగూర్చుటయకాక "కామి గాక మోక్షగామి కాఁడు" అను లోకోక్తిని సార్థకపఱచి యిహలోకమునందు యుక్త మగు నానందము నొడఁగూర్చుచుఁ దుదకు జీవులకు నిరతిశయానందపదవి యగు మోక్షమును జేకూర్చు నని శ్రీమద్రామాయణము సాక్ష్య మిచ్చుచున్నది.

(3) కామోద్రేకముచేఁ బీడితుఁడై మరణించిన యజమహారాజునకుఁ బుత్రుఁడైన దశరథమహారాజునకుఁ దొలుత నకామమే మహాత్ములగు పుత్రుల నొసంగి తుద కదియే యాతనిముప్పునఁ బెక్కు తిప్పలు దెచ్చిపెట్టి మృత్యువుగఁ బరిణమించెను.

(4) మరల నా కామశక్తియే వాల్మీకిమహర్షియందు దోక విశ్వ తిని రేపి యాతనికి మానసికవ్యథను గలుగఁజేసి తుద కద్దానివలన నిరతిశయకావ్యరసప్రవాహ ముద్భవింపఁజేసి యా ఋషిపుంగవున కమరత్వము సిద్ధింపఁజేయుటయు కాక భగీరథునియందలి పితృకామమువలన గంగాస్రవంతి లోకమునఁ బ్రవహించి మానవకోటిని బవిత్ర మొనరించి నటుల యా వాల్మీకి లేఖినినుండి వెలువడిన శ్రీమద్రామాయణము నేఁటికిని మానవులకుఁ బరమలక్ష్యమై స్త్రీపురుషుల కొజ్జబంతియై విరాజిల్లుచున్నది.

ఈ రీతి శ్రీమద్రామాయణమునందు శ్రీరామునిచారిత్రముతో పాటుగ "కాముని" చారిత్రముగూడ నిమిడియున్న దని మనము గుర్తింపవలెను. అందువలననే వాల్మీకి దానిని "సీతాయా శ్చరితం మహత్" అని స్పష్టిలోఁ నామమున కంతకును నాలంబన మగు స్త్రీపాత్రవర్ణనముగూడ నందు సాగించియున్నాఁడు. రామాయణ మన "రామస్య అయనం" అని మాత్రమేకాక "రామాయాః అయనం" అనిగూడ మనము గ్రహింపవలెను. అందు కౌసల్య, సుమిత్ర, కైక మున్నగు నారీమణులు మొదలు శూర్పణఖాదిస్త్రీపాత్రల నెన్నింటినో వాల్మీకి తన యసమానకవితామృతశక్తిచేఁ బోషించి లోకమునందలి నేఁటినారీమణులకు సత్ప్రవర్తన మలవఱచుకొనుటకై యందించియున్నాఁడు. ఇట్టి విలక్షణ "కామ" చారిత్రవిస్ఫురణము నాందియే రామోత్పత్తికిఁ గారణమైన "పుత్రకామేష్టి".

వేదవిదు లగు మహర్షులు సృష్టిస్థితిలయములయొక్క మహత్తర రహస్యములను గనుఁగొనుటకై వేలకొలంది సంవత్సరములు దమ యాయుర్దాయమును బెంచుకొనిరి. "Curiosity impels us to discover the universe" అని యొక పాశ్చాత్యపండితుఁడు వ్రాయుచున్నాఁడు. అట్టి మానవాయుర్దాయమును బెంచుకొనునట్టి శాస్త్రము

నకు యోగశాస్త్రమని పేరు. దశరథుఁ డఱువదివేల యేండ్లు రాజ్య మొనరించె నని వాల్మీకి వ్రాసినచో మన కది యొక యభూతకల్పనగ నుండఁగలదు కాని నేఁ డొక యిరువురిచేఁ జేయఁబడిన యంత్రము లెక్కలను దయూకుచేయఁగలుగుట మనము కన్నారఁ జూచుచున్నాము. ఇంతియే కాదు పాశ్చాత్యదేశమునుండి యే వింతయంత్రములు వచ్చి మనలను దిగ్భ్రమ నొందించుటలేదు? కాని మన పూర్వు లొనరించిన లోకాతీతచర్య లన్నియు మాత్రము మన కప్రమాణములు. నేఁటిమానవులు కేవలయంత్రపరికరములచే నెల్ల బద్ధులై యీశ్వరచైతన్యశక్తిని గుర్తింపఁజాలకున్నారో "Carrel" పండితుఁ డీ తీరున వాపోవుచున్నాఁడు! "In such indirect ways does science know the spiritual world, which, by definition, it is forbidden to enter. Man in his entirety is located within the jurisdiction of the scientific techniques" మన మహర్షులు తమ తపస్సమాధినిష్ఠలచేఁ జిరకాలము పరిశీలించి యీ చరాచరాత్మక మగు భూతసృష్టి యొక్క తత్త్వమును గ్రహించి యుపాసనవలన నొక మట్టికుండ మొదలు మహాకార్యధురంధరుఁడగు చక్రవర్తిని గూడ సృజించునట్టి యుపాయతంత్రములను గనిపెట్టియున్నారు. కృతయుగమున నిక్ష్వాకునకు బారసాల నొనరించిన వసిష్ఠుఁడు శ్రీకృష్ణునకు ద్వాపరయుగాంతమం దొనరించిన యష్టమునందుఁగూడఁ బాల్గొనె నని మనకు భాగవతము బోధించుచున్నది! అతఁ డూరక రోజునకు రెండుపూఁటల భోజనము చేయుటకై తన దీర్ఘాయుర్దాయమును వృద్ధిచేసికొనెనా? లేక క్లబ్బులో చీట్లపేకాడుకొనుటకా? కాదు. ఆ బ్రహ్మపుత్రుఁడు కేవలలోకకళ్యాణమునకై తన జీవితమును ధారవోసె నని మనకు రామాయణము బోధించుచున్నది. అట్టిమహాత్ముల పరిశోధనములే వేదప్రతిపాదితము లైన యజ్ఞములుగా మనకు సర్వవస్తుసముదాయములను సమకూర్చునట్టి కామధేనువులై నేఁటివఱకు మన కనేకవిధము లగు సుఖముల నొడఁగూర్చు

చున్నవి. వారితపోబలముచేతనే మనము నేఁడు మనుచున్నార మను టకు సందియ ముండరాదు. మనపితామహుఁడు నాటిన చూతవృక్ష ఫలములు మనము నేఁ డనుభవించుటలేదా ?

శ్లో॥ "సహయజ్ఞైః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేష వోఽస్త్విష్టకామధుక్॥" (గీత).

అని శ్రీకృష్ణభగవానుఁ డర్జునున కుపదేశించెను. శ్రీమ ద్భాగవతము నందలి ద్వితీయస్కంధమునఁ దృతీయాధ్యాయములో నే యే ఫలములను గాంక్షించువార లే యే దేవతల నుపాసింపవలెనో శుకయోగీంద్రుఁడు పరీక్షితున కుపదేశించియున్నాఁడు. అందు "బ్రహ్మవర్చసకామస్తు యజేత బ్రహ్మణస్పతిమ్, ఇంద్రమింద్రియకామస్తు ప్రజాకామః ప్రజా పతీన్॥" అని చెప్పఁబడియున్నది. శ్రుతియందుఁగూడ "యః ప్రజాకామ స్స్యా త్తస్మా ఏతం ప్రాజాపత్యం గాయత్మతం చరుం నిర్వపే త్ప్రజాపతిః"అని చెప్పుటచే "పుత్రకామేష్టి ప్రజాపతినిగూర్చి యొనరింపఁ బడు నొక యజ్ఞము. కావుననే యా యజ్ఞకుండమునుండి పాయస పాత్రముతో బయలువెడలిన పురుషుఁడు "ప్రాజాపత్యం నరం విద్ధి మా మిహాభ్యాగతం నృప" యని పలికియున్నాఁడు. అగ్నిహోత్రము నుండి యొక తేజోమయభూతము బయలువెడలుట నేఁటి మన నవనాగ రికుల కుత్ప్రేక్షగాఁ దోఁచవచ్చును. కాని రామాయణకాలమునాఁటి మానవు లద్దానిని జూచియుండిరనుట మనకు వాల్మీకిమహర్షి తెలుపుచున్నాఁడు. నేఁటి పాశ్చాత్యవిజ్ఞానమునకును రామాయణ కాలమునాఁటి వేదవిజ్ఞానమునకును జీకటివెల్తురులకుఁ గల సంబంధము వంటిది. చీకటియావరించినంతనే మన మంతకుఁబూర్వము చూచిన పదార్థములనైనను మఱతు మని యందఱు నెఱింగినవిషయమే. భారత వర్షమునుండి లోక మంతయు నొకానొక కాలమునందు విజ్ఞానభాను కరదీప్తి వెలువడియుండెను. అట్టివిజ్ఞానచైతన్యసంజనితశక్తిచే మనవా

రీ పంచభూతములనుండియు నమృతమును బిదికి తాము తరించి యిత రులను తరింపఁ జేయఁజాలిరి. నేఁ డట్టివిజ్ఞాననిధులు లేకపోవుటకుఁ గారణములను Carrel పండితుఁ డీ తీరున నుడువుచున్నాఁడు:–

"Presidents of universities and their advisers donot realize that Synthetic minds are as indispensable as analytic ones. If the superiority of this kind of intellect were recognized and its development encouraged specialits would cease to be dangerous" ఈ సృష్టిలోని యపూర్వశక్తిని సమీకరించి యద్దానివలన నీశ్వరచైతన్యమును ఘనీభవింపఁ జేసి యొక విలక్షణమానవుని లోకమునందు సృష్టింపఁదొరఁకొని రానాఁటి మహాత్ములు! దాని దశరథునకు ఘటింపఁజేయ మొనరింపసమకట్టిన కులాలకునికిఁ జక్రసహాయమువలె నా ఋషులకు సహాయభూతుఁ డయ్యెను.

నే నీ నవలలో రచించిన దశరథపాత్రవిమర్శనమునందుఁ దనకుఁ బుత్రులవలన మరణము కలుగు నని యెఱింగియు నా రాజచంద్రుఁ డేల సుతులకొఱకు యాగము నొనరింప సమకట్టినని యొక పూర్వపక్షమును బేర్కొనియుంటిని. దాని కిచ్చట నా శక్తికొలఁది సమాధాన మొసంగుచున్నాను.

సర్వసాధారణముగ మానవుఁ డభ్యర్థించునవి యర్థప్రాణములు. కాని యవి రెండును సచేతనములు ప్రజాజాతము నపేక్షించుచునే యుండును తెరువుల పెనుబలిమ్మాలు గాడ వానిని వాంఛించుట సర్వజనవిదితము. అయ్యవి రెండును పుష్కలములుగఁ గలిగినపిమ్మట ప్రాణికోటులుగోరునట్టి దింద్రియసుఖము. మానవుఁ డీ త్రివిధసుఖముల కన్న మిన్నగఁ బాటించునట్టిది 'కీర్తి' యను నొకానొక యపూర్వ విషయము కలదు. అయ్యది యదృశ్యము. పుష్పమునందలి పరిమళము వంటిది. 'కీర్తి' యనునది యెంతకాల మీ భూమిపై నిలిఁచియున్న సంతానము బున్నలోకావాసము దముకుఁ గలుగు నని యార్షమత

సాంప్రదాయజ్ఞుల యభిప్రాయము. నేఁటికిని ద్విజులు తమ నిత్యసంధ్యావందనమునందు "ఆయుఃపృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం మహ్యాం దత్వా ప్రయాతుం బ్రహ్మలోకం" అని సవితనుగూర్చి ప్రార్థింతురు. ఈ బ్రహ్మలోకము కేవలకీర్తిప్రతిష్ఠితలోకము. కీర్తిని "పుణ్యశ్లోక" మనికూడ వ్యవహరింతురు. కీర్తికొఱకై యనేకులు పూర్వులు సర్వాచీనులుగూడఁ దమతమదేహముల నర్పించిరి. అట్టి మహత్తరకీర్తికాముఁడు దశరథుఁ డని చెప్పినఁ దప్పులేదుకదా! అతనికిఁ బుత్రులు లేకున్నచో నిక్ష్వాకువంశము దశరథునితో నంతమైనదనిన నాతని కెంత యపకీర్తి! దశరథుఁడు సంతానహీనుఁడై చచ్చె ననుటకన్న సంతానమువలనఁ జచ్చె ననుట మేలుకాదా! "సంభావితస్య చాకీర్తి ర్మరణాదతిరిచ్యతే" అనుచు భగవానుఁ డేనాఁడో పలికియున్నాఁడు. నిజమునకుఁ దన కట్టి యపయశము కలుగకుండుటకై యే యాతఁడు మూఁడువందలయేఁబది భార్యలను బెండ్లియాడి తుదకుఁ గైకతండ్రికి రాజ్యశుల్కవాగ్దానముగూడ నొసఁగించి యామెను బెండ్లియాడెనేమో యని చెప్పవలసియున్నది. ఆనాఁటి లోకమునందు దశరథుఁడు మహాపౌరుషశాలియు, మహత్తరవీర్యవంతుఁడునై దేవతలకుఁగూడ సహాయ మొనరించుచుండినట్టి మేటి యని ప్రసిద్ధిచెందెను. అతఁ డొక నపుంసకుఁడు కాఁడు. అట్టివానికి సంతానము లేకున్నచో దైవవశమునఁ గలుగలేదందురా లోకులు? తనకు సంతానము కలిగినచో మృత్యువు వారివలనఁ గలుగు నని భయ మంది దశరథుఁడు సంతానోత్పత్తికిఁ దగు ప్రయత్నము సలిపియుండ లేదందుము. ఆతని పూర్వుఁ డగు దిలీపుఁడు తుదకు వసిష్ఠుని గోవులను గాచియైన సంతానము బడసియుండ దశరథుఁడు భీరువు కావున సంతానము లేకుండఁ జచ్చె నని లోక మనకుండనుండునా? పైగ భగీరథునకు బ్రహ్మకూడ నీ తీరున వర మొసంగియున్నాఁడు.

శ్లో॥ "దేయా చ సంతతి ర్దేవ! నావసీతే త్కులం చ నః ।
ఇక్ష్వాకూణాం కులే దేవ! ఏష మేఽస్తు వరః పరః ।"

* * *

"ఏవం భవతు భద్రం తే ఇక్ష్వాకుకులవర్ధన!" (1-42-20,22)

ఈ రీతిగ బ్రహ్మవర ముండియున్నను దశరథుఁడు సంతాన మొందఁజాలకుండు టాతనిప్రయత్నలోపమును భయకారణము నని లోకులు తప్పక చెప్పుకొందురు. కావున దశరథుఁ డట్టి యపకీర్తి తనకుఁ దగులకుండుటకై యెట్లైనఁ బుత్రులను బడయ నిశ్చయించెను.

ఇఁక రెండవకారణ మరయుదము వేదమత మంతయుఁ గర్మకాండము నాధారముగఁ గలిగియున్నది. అందులకే భారతవర్షమును గర్మభూమి యనికూడ వ్యవహరింతురు. ప్రతికర్మకును బితృదేవపూజనము ముఖ్యాంగము. పితృదేవతారాధనమునకు సంతాన మున్నఁగాని జరుగనేరదు. వేదము "ప్రజాతంతుం మా వ్యవత్సీః" యని విధించుచున్నది. ఈవిషయమును రామాయణమే యీ తీరున నిర్వచించుచున్నది :—

శ్లో॥ "పున్నామ్నో నరకా ద్యస్మా త్పితరం త్రాయతే సుతః ।
తస్మా త్పుత్ర ఇతి ప్రోక్తః పితౄ న్యః పాతి వా సుతః ॥"

శ్లో॥ "ఏష్టవ్యా బహవః పుత్రాః గుణవంతో బహుశ్రుతాః ।
తేషాం వై సమవేతానా మపి కశ్చి ద్గయాం వ్రజేత్ ॥"

(2-107-12,13)

కావున వంశకరు లగు పుత్రులు లేకున్నచో పితరులకు గతులు కలుగఁజాల వని యార్యమతసిద్ధాంతము. అపుత్రకులగువారలు యజ్ఞాదిక్రతువులు చేయుటకుఁగూడ వీలులే దని పెద్ద లందురు. కావున దశరథుఁడు పితరులను దరింపఁజేయుటకును తాను తరించుటకునుగూడఁ బుత్రులను బడయ నిశ్చయించెను. తా నెప్పటికైనఁ జావకుండ నెటు లుండఁగలఁడు? పుత్రునిచేత సంస్కరింపఁబడుట పితరుల కవశ్యవాంఛితము కదా!

వీని కన్నిటికన్న మిన్న యగు మూఁడవకారణముగూడ మనము గ్రహింపవలసియున్నది. దశరథుఁడు వేదధర్మతత్పరుఁడు. వసిష్ఠశిష్యుఁడు. సూర్యవంశమునకుఁ జెందిన క్షత్రియపుంగవుఁడు. మనువునాఁటనుండియు నీ భారతవర్ష మత్యంతజాగరూకతతో ధర్మయుక్తముగ నేలిరి యిక్ష్వాకువంశస్థులు. అందుచేతనే వారిని బరశురాముఁ డేమియుఁ జేయకుండ విడిచిపుచ్చెను. అట్టి సద్వంశజాతుఁ డగు ధర్మమూర్తి తనయనంతరము దేశపరిపాలనమును ధర్మయుతముగ సాగింపఁగల యుదారుఁ డగు పుత్రుండు లేనిచో నెటుల నూరకుండఁగలఁడు? సమర్థుఁడును బ్రాజ్ఞుఁడు నగు ప్రభువు లేనిచో దేశ మధోగతిపాలుకాదా? ధర్మ మడుగంటదా? ప్రజలు నీతిబాహ్యులై దేశము నల్లకల్లోలములందు ముంచివైతురు. సేతుశీతనగపర్యంత మగు భారతవర్షమున కిక్ష్వాకువంశస్థులె ప్రభువులై యుండిరి. వింధ్యకు దక్షిణమందు దండకుఁ డనెడి యిక్ష్వాకువంశప్రభువు రాజ్య మొనరించుచుండెడివాఁడు. శుక్రశాపవశంబున నాతనిరాజ్యము నందుఁ బదురెం డహోరాత్రములు దుమ్ము వర్షించుటచే నయ్యది యంతయుఁ బీళభూమియై యరణ్యముగ మాఱెను. అటుల నిర్మానుష్య మగు దేశమును దక్షిణసముద్రమునం దుండెడి లంకానివాసు లగు తిమిధ్వజాదిరాక్షసులు మెల్లగ నాక్రమించి రాజ్యము చేయఁదొడంగిరి. తిమిధ్వజకుమారుఁ డగు శంబరునితో యుద్ధమునకు దశరథుఁ డేఁగి యాతనిమాయవలన నతఁడు పరాజితుఁ డయ్యెను. తుద కా శంబరుని శ్రీరాముఁడు యుద్ధమునం దోడించి సంహరించె నని మనకు శ్రీమద్రామాయణము తెలుపుచున్నది. ఆనాఁటి శంబరాదులసంతతియే యచ్చటచ్చటఁ బ్రచ్ఛన్నముగ నుండి ద్రావిడు లని యాంధ్రు లని వ్యవహరించుకొనుచుండిరి. కంసుని యాస్థానమునందలి చాణూరముష్టికులలోఁ జాణూరుఁ డాంధ్రదేశమునం దుండిన రాక్షసుఁ డని మనకు విష్ణుసహస్రనామము చెప్పుచున్నది.

# పాండురంగమాహాత్మ్యము - తద్వ్యాఖ్యానము

శ్రీ సామవేదం శ్రీరామమూర్తి.

శ్రీ రామకృష్ణకవి ప్రణీతమయిన పాండురంగమాహాత్మ్యము ఆంధ్ర పంచకావ్యములలో నొకటిగాఁ బ్రసిద్ధికెక్కిన ప్రౌఢప్రబంధము. ఇట్టి గ్రంథములు వ్యాఖ్యానములు లేనిచో సందఱకు సుబోధములు గావనుట నిర్వివాదము. కవిహృదయమును గ్రహించి పాఠకుల కందిచ్చుట వ్యాఖ్యాత చేయుపని. అందులకు సమర్థుఁడగు వ్యాఖ్యాతచే రచింపఁబడిన సద్వ్యాఖ్యాన మెంతయు నావశ్యకము. వ్యాఖ్యాత సమర్థుఁడైనను మూలము పరిశుద్ధపాఠములతో లభింపనియెడల సద్వ్యాఖ్య బయలు వెడలుట కష్టము. మూలమున నపపాఠములు లేకుండుటకు లేఖకులు (నేఁడు ముద్రాపకులు) విజ్ఞులు నప్రమత్తులును గావలయును. లేకున్న సత్కవుల పరిశ్రమఫలము ప్రజల కందదు. "ఒప్పుతప్పురయు రసజ్ఞులూహఁ దెలియంగల లేఖక పాఠకోత్తముల్, దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపుమనంగ శక్యమే" యను పెద్దన పలుకులకుఁ గారణ మిదియే. కవియూహ యేమైయుండు ననునాలోచన లేఖకులకును వ్యాఖ్యాతలకును బిదపఁ బాఠకులకును మిగుల నావశ్యకము.

ఇఁకఁ బ్రకృతవిషయము. పెక్కు తెలుఁగుగ్రంథములవలెనే పాండురంగమాహాత్మ్యముగూడ నిర్దుష్ట పాఠములతో లభింపదయ్యెను. ఇప్పటికి దీనికి రెండువ్యాఖ్యలు వెలువడినవి. అందు మొదటిది శ్రీ తెన్మఠము శ్రీరంగాచార్యులవారు రచించి ప్రకటించినది. ఇది లఘుటీక. రెండవది శ్రీ బులుసు వేంకటరమణయ్యగారు రచించినది. దీనిని శ్రీ వావిళ్లవారు ప్రకటించిరి. శ్రీ రంగాచార్యులవారు ప్రకటించిన గ్రంథమున నపపాఠము లత్యధికముగా నుండుటచేతను, లఘుటీక మూలార్థావగతి కనుకూలముగా లేకుండుటచేతను దా మీగ్రంథమును బ్రకటించినట్లు వావిళ్ళవారు "ప్రకాశకుల విజ్ఞప్తి"లోఁ దెలిపిరి.

శ్రీ వేంకటరమణయ్యగారు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము లోని మూఁడు వ్రాఁతప్రతులను బరిశీలించియు శబ్దరత్నాకర సూర్య రాయాంధ్ర నిఘంటువులలో నట నట నుదాహరింపఁబడిన గ్రంథభాగ ములను బట్టియు దీనిని బరిష్కరించి పూర్వటీకకంటె విపులమగు టీక రచించి చక్కనిపీఠికతోఁగూడఁ బ్రకాశింపఁజేసిరి. తమవ్యాఖ్యలో నడుమ నడుమఁ బూర్వటీకలోని విషయములఁ జూపి విమర్శించిరి. పాఠాంతరముల నధస్సూచికలోఁ జూపిరి. ఇట్లొనర్చిన వీరి కృషి మిగుల శ్లాఘనీయమయినది.

కాని యిందును గొన్ని యపపాఠములు మూలమునఁ గన్పట్టు చున్నవి. కొన్నియెడల మూలము నిర్దుష్టముగా నున్నను వ్యాఖ్య యపమార్గము పట్టినది. కొన్నిపట్టుల సందేహాస్పదవిషయము లుండి పోయినవి. (ఈవిషయము వ్యాఖ్యాతలే పీఠికలో వ్రాసియున్నారు.) కొన్నితావులలో వీరు గ్రహించిన పాఠములకంటెఁ గ్రిందికిఁ ద్రోసిన (అధస్సూచికలోఁ జూపిన) పాఠములే సమంజసములుగాఁ దోఁచు చున్నవి. అందుఁ గొన్నింటిని బండితుల పరిశీలనార్థ మిటఁ బేర్కొం దును. గుణదోషముల బరిశీలింతురుగాక.

గ రు డ స్తు తి

శా. మీఁదం దారధరాధరంబు గల యామేరున్నగంజాలి త
త్పాదప్రస్తుండరుచిం దలిర్పు ఖగయూథస్వామి హేమప్రభా
ప్రాదుర్భావశుభప్రభుండు మనుమఁగా రామానుజామాత్యు శ్రీ
వేదాద్రీశు విరూఢిమందిరు జగద్విఖ్యాత కీర్తిశ్వరున్.

(ఆ 1-పద్యము 8)

టీక. "హేమప్రభాప్రాదుర్భావశుభప్రదుండు = బంగరుకాంతి వలనఁ గలిగిన శుభముల నిచ్చువాఁడు (గరుడదర్శనమువలన మేళ్లు కలుగునని ప్రసిద్ధి)" అని వ్రాసిరి. మూలములో శుభప్రభుండు అని

యుండఁగా శుభ్రపదుండు అను పాఠమునకు వ్యాఖ్య కావింపఁబడెను. ఇది మూలమునకు సంబంధములేని వ్రాఁత. గరుడదర్శనము శుభముల నిచ్చునదైనను ప్రస్తుతమున మేరుసామ్యసిద్ధికి "హేమప్రభాప్రాదుర్భావ శుభ్రప్రభుండు" అను పాఠమే యుక్తముగా నున్నది. సువర్ణకాంతివంటి శుభకాంతి కలవాఁడని దీనియర్థము.

కృతిపతివంశపురుషుల వర్ణనమున "రంగరాజు" అనువాని వర్ణనము.

తే. సలిలనిధిజాలజంఘాలబలవిశాల
ధూళిపాళీభరాళీకధూమభూమ
శంకితాత్మప్రతాపవైశ్వానరుండు
గంగమాంప్రాణవిభుఁడొప్పు రంగరాజు. (1-38)

టీక. "సలిలనిధి ..... వైశ్వానరుండు, సలిలనిధిజాల=సముద్రముల సమూహమును, జంఘాల=మిక్కిలివడిగా దాఁటునట్టి, బల=సేనలవలని, విశాల, ధూళి, పాళీ, భర=ఎక్కువైన దుమ్ము చాలుయొక్క అతిశయమనెడి, అళీకధూమభూమ=అబద్ధపుపొగయొక్క ఆధిక్యముచే, శంకిత=సందేహించిన, ఆత్మప్రతాప=తన ప్రతాపము కల, వైశ్వానరుండు=అగ్ని కలవాఁడు. వేదాద్రిమంత్రి సేనలు నడిపించుకొనిపోగా దానివలన పుట్టిన దుమ్ము సప్తసముద్రములను దాటిపోయినది; ఆ దుమ్ము పొగవలె నుండఁగా దానిని చూచి అగ్ని తనప్రతాపమువలన లోకములు మండి పొగవ్యాపించినదేమో యని భ్రాంతిపడుచున్నాఁడని భావము" అని వ్రాసిరి.

ఇందు రెండుపాదముల యర్థము బాగుగనే యున్నది. మూఁడవపాదము న్నర్థము సరికాదు. దానిని బట్టి వ్రాసిన భావముగూడ చెడినది. ఈ కల్పనమే వ్యాఖ్యాతలు గ్రహింపలేదు. శంకితాత్మప్రతాపవైశ్వానరుండు=ఊహింపబడిన తన (రంగరాజుయొక్క) ప్రతాపమనెడి యగ్ని గలవాఁడు అని యర్థము. రంగరాజు సైన్యోత్థితధూళి

పొగగాను, వానిప్రతాపము అగ్నిగాను రూపింపఁబడెను. ధూమముచే నగ్ని యనుమానింపఁబడుట ప్రసిద్ధముగాన సైన్యధూళిధూమముచే నాతని ప్రతాపాగ్ని యూహింపఁబడినదని కవి యాశయము. దీనిని గ్రహింపక యేమేమో వ్రాసిరి. "తన ప్రతాపమనెడి యగ్నికలవాఁడు." అన్న పూర్వ (లఘు) టీకయే యుచితముగా నున్నది. భాగములో "వేదాద్రిమంత్రి" యను వ్రాంతి ప్రామాదికము. ఇయ్యది రంగరాజునుగూర్చిన వర్ణనము కాని వేదాద్రిమంత్రివర్ణనము కాదు

కృతిపతివంశవర్ణనసందర్భమున రామరాజునకు నలుపురు పుత్రులు కలిగిరను సందర్భమున

సీ. సంహతాంహస్స్ఫూర్తిసింహాసనుండు నృ
  సింహావిక్రముఁడు నృసింహశౌరి
త్రయ్యంతవాసనాగ్రహబుద్ధి నోబయ్య
  యోబయ్యారి రామానుజయ్య గాఁక
గంగాతరంగసారంగలాంఛనదీప్తిఁ
  బొంగకీర్తి రాఁడు రంగరాజు
శరణాగతత్రాణకరుణాకరణకేళి
  వరదరాజులఁబోలు వరదరాజు
... . ..................... ...... (1-42)

టీక-"సంహతాంహస్స్ఫూర్తిసింహాసనుండు = నశింపఁజేయఁబడిన పాపముల ప్రకాశము నెడి సింహాసనముకలవాఁడు, త్రయ్యంత ..బుద్ధి= వేదాంతవాసనచేఁ బరికట్టఁబడిన బుద్ధిగలందు, ఓబయ్యారి = నేర్పరి" అని వ్రాయఁబడెను.

ఇందుఁ బూర్వముద్రితప్రతులను "సహ్యతాంహస్స్ఫూర్తి" యని యుండఁగా వీరు దానిని విడచి వేఱొక గ్రంథము (ద-ప్రతి) లోని "సంహతాంహస్స్ఫూర్తి" యను పాఠమును గ్రహించిరి. ఈ మార్పు

వలన లభించిన గుణవిశేషము తోఁచకున్నది. కాఁగా మొదటిపాఠమే యుక్తముగాఁ దోఁచుచున్నది. ఏలయనఁగా 'సమ్' పూర్వకహన ధాతువు హింసార్థమున ప్రసిద్ధముగాఁ గానరాదు. సంహతశబ్దమునకు దృఢముగాఁగలిసినదనునర్థము ప్రసిద్ధమై ప్రయోగదృష్టమగుచున్నది. "దృఢసంధిస్తు సంహతః" అని యమరకోశము. (3-76)

"సంజ్ఞుస్సంహతజానుకే" (అమరకోశము 2-307) అనుచోటఁ "కదిసిన మోకాళ్ళుకలవాఁ"డని యర్థము గురుబాలప్రబోధికలోఁ గలదు. శబ్దరత్నాకరమునఁ నీశబ్దమునకు "చక్కఁగాఁ జేరినది, దృఢసంయోగము కలది" యనునర్థములే యున్నవి. కాని చంపఁబడినది, లేక నశింపఁజేయఁబడినది యనునర్థము చూపఁబడలేదు. పరవస్తువారి నిఘంటువులోఁగూడ నీయర్థము లేదు. ఒక సంస్కృతాంధ్రనిఘంటువులో (నేను జూచినంతలో) యున్నది. ఇంతేకాదు మొదటిపాఠము సరిగానుండఁగాఁ బ్రయోజనాంతరములేని యీ యప్రసిద్ధార్థకపదముతోడి పాఠమేల గ్రహింపవలెను. కావునఁ బూర్వపాఠమే గ్రాహ్యము.

రెండవపాదములోని "త్రిదశ్యంతివాసనాగ్రహబుద్ధినోయ్యారి" యను భాగమునకును పీరి వ్యాఖ్యకును సంబంధము గానరాదు. గ్రహశబ్దమునకు బహుకర్త లనర్థము చింత్యము. అథస్సూచికలో "శయ్యాగ్రహాద్బు" అను పాఠాంతరము చూపఁబడెను. అది "గ్రహద్బు" గాక "గృహాద్బుద్ధి" యనుకొందును. ఆ పాఠమును దృష్టిలోఁ బెట్టుకొని యీ వ్యాఖ్య చేసియుందురేమో ? అట్లయిన దానినే మూలమున గ్రహించియుండవలయును. అప్పుడు మూలటీకలు సంగతములగును "త్రిదశ్యంతవాసనాశయ్యాగృహాద్బుద్ధి యొయ్యారి ధామానుజస్ఫుటాంకు" అనునది సరియైన పాఠము. వేదాంతవాసనలకు శయ్యాగృహము (విశ్రాంతిస్థానము) వలె నాచరించు బుద్ధికలవాఁడని యర్థము. అప్పుడు ఒయ్యారి శబ్దము పునరావృత్తము కానక్కఱలేదు. ఇంకొక

విశేష మేమనఁగా నీ సీసమునందుఁ బ్రథమపాదమునను బ్రారంభింపఁబడిన ప్రాసయతియే చివరిదనుక నిర్వహింపఁబడెను. అద్దానఁగూడ నీపాఠమే 'రామకృష్ణునిదని నిశ్చయింపఁదగును.

కృతిపతిసోదరుల వర్ణనమున :—

విష్ణుపదధ్యాననిష్ణాత విజ్ఞానకృష్ణుండు శ్రీరామకృష్ణమంత్రి (1–69)

టీక–"నిష్ణాత=అతితేఱినవాఁడు; విజ్ఞానకృష్ణుండు=గొప్పజ్ఞానమున కృష్ణపరమాత్మ" అని వ్రాసిరి. నిష్ణాతశబ్దము అకారాంతముగాని ఋకారాంతముగాదు. ఇంకొకచోట "తృష్ణారహితులు మత్పద, నిష్ణాతలు నిత్యసత్యనిరతులునగు..." (4-205) అను పద్యములోను దాని టీకలోను నిష్ణాతలనియే యున్నది. మఱియు వీరి పీఠికలో 35వ పుటలో నిష్ణాతలనియే వ్రాసియున్నారు. దీనినిబట్టి యీశబ్దము ఋకారాంతమని వీరు భ్రాంతిచెందిరని తోఁచుచున్నది. ప్రకృతమున 'విష్ణుపదధ్యాననిష్ణాతవిజ్ఞానకృష్ణుండు, అని సమాసముగా గ్రహించి విష్ణుపాదధ్యాననిపుణమైన విజ్ఞానమున నర్జునుఁడైనవాఁడు అని యర్థము చెప్పుట యుక్తమనుకొందును. విష్ణుభక్తులలో నర్జునుఁడు ప్రసిద్ధుఁడగుటచే రామకృష్ణమంత్రి యర్జునునివలె విష్ణుభక్తుఁడని భావము. లేదా విష్ణుపాదధ్యానవిజ్ఞానముచే (లోకుల) నాకర్షించువాఁడనియుఁ జెప్పవచ్చును.

అనుచు సభార్యుండై వింధ్యాహార్యస్తంభయిత సంతాపరోగంబున నిరిడి చని (1–137)

టీక–"వింధ్యాహార్యస్తంభయిత=అడ్డులేకుండ వింధ్యము నరికట్టినవాఁడు–అగస్త్యుఁడు" అని వ్రాసిరి. 'అడ్డులేకుండ' ననునర్థ మెట్లు వచ్చెనో? అహార్యశబ్దమునుబట్టి యీ యర్థము వ్రాసియుందురు. అది సరికాదు. అహార్యమనఁగాఁ బర్వతము. వింధ్యపర్వతము నరికట్టినవాఁడని దీనియర్థము.

పుండరీకుఁడు సాక్షాత్కరించినవిష్ణువును బ్రార్థించు సందర్భమున

శా. భస్మాగ్నాలనపాండురాంగము రమాప్రాణేశు పాదద్వయిన్
విస్మేరాంబుజగామి హంసమిది నాచేవ్రాల్చుచున్ లేచి 'దే
వాస్మాకం శరణం త్వమేవ గతిరన్యో నాస్తి దుర్వ్యాసనా
పస్మారంహార' యంచుఁ బల్కి మతియున్ భక్తుండు భక్తిస్పృహన్. (2-54)

ఇందు రెండవపాదమున 'నాచే' అనునది యచ్చుతప్పు. 'నావే' అని యుండఁదగును. "నాన్ = అనునట్లు, వే వేగముగ" అని వ్యాఖ్య యుక్తముగనే యున్నది. మూఁడవపాదమున 'గతిరన్యోనాస్తి' యనుట తప్పు. ఇది యచ్చుతప్పుగా భావింప వలనుపడదు. వ్యాఖ్యలోఁగూడ 'గతిరన్యోనాస్తి' యనియే యున్నది. పైపాఠమున యతిపోవుట యొక దోషము, స్త్రీ లింగగతిశబ్దమునకు విశేషణమైన అన్యశబ్దము పుంలింగముగానుండుట వేఱొకదోషము. పూర్వగ్రంథ టీకల ననుసరించి వీరు నట్లు వ్రాసిరి. 'గతిరన్యానాస్తి' యనుట యొప్పును.

శా. శీతాహార్యకుమారి! విన్ముటులు లక్ష్మీజాని వాచంయమి
వ్రాతశ్రేష్ఠునకున్ వరంబొసఁగి............(2-76)

'వాచంయమి' యనుట తప్పు. 'వాచంయమ' అని యుండఁదగును. ఇది అకారాంత శబ్దము. యమిన్ శబ్దము వీరికిభ్రమ కలిగించి యుండును. మూలముననే గాక టీకలోఁగూడ నిది యిట్లే యుంచుటఁ జేసి ముద్రణదోషముగా భావింప వీలులేదు. పూర్వ టీకాకారుల పాఠమునే వీరును గ్రహించిరి.

శివుఁడు పార్వతితో విష్ణుమూర్త్యర్చనవిధానము చెప్పు సందర్భమున

సీ. మంత్రపూతముగాఁగ మజ్జనం బొసరించి......

తే. దధులతోఁగూడఁ దగు నివేద్యములఁ జూపి
వనధి వనధాముఁ బీతాంబరుని రమా కు

చరజ వినిలిప్త శిఖబర్హాధరు మఖాంశ
భోక్తఁ బూజింపఁదగుఁ జైత్రమున శుభాంగి ! (2-108)

టీక. "......రమా .... వినిలిప్తుఁ = లక్ష్మీదేవి స్తనములమీఁది గంధపురేణువులచేతఁ బూయఁబడినవానిని ; (ఇచట 'రజస్' శబ్దమునకు 'రజ' స్వతంత్రప్రయోగము)" అని వ్రాసిరి. కుచరజ మనఁగా స్తనములమీఁది రేణువులను నర్థమేగాని గంధపురేణువు లను నర్థ మెట్లువచ్చును ? అది యధ్యాహార్య మనుకొనవలయును. మఱియు సకారాంతరజశ్శబ్దమును అకారాంతముగాఁ బ్రయోగించుట యశాస్త్రీయము. ఇంతయైనను అర్థము సొగసుగాలేదు. కావున నీపాఠము సరియైనది కాదనుకొందును. అధస్సూచికలోఁ జూపఁబడిన 'చరని' యను పాఠముకూడ సంగతముగాఁ గానరాదు. 'రమాకుచ రజని విలిప్తుఁ' అనునది సరియైన పాఠమని తోఁచెడిని. రజని యనఁగాఁ బసుపు. లక్ష్మీస్తనములందలి పసుపుచేఁ బూయఁబడినవాని నని యర్థము. అట్లయిన నర్థము స్వారసముగా నుండుటయేగాక రామకృష్ణ కవి సకారాంతశబ్దమును అకారాంతముగాఁ బ్రయోగించె ననుకొన వలసిన దురవస్థ తప్పును. అదియుఁగాక వినిలిప్తపదములో 'ని' చేరి లిప్తవిలిప్తపదములవలెఁ గాక విలక్షణముగా నున్నది.

పసుపునకుఁ బర్యాయముగా 'రజని' యని మాఱుమూల మాట వాడుటా యని సంశయింపఁ బనిలేదు. అట్టి పదముల వాడుట యీకవికి మిగుల నిష్టము. చూడుఁడు.

చ. ఉమ పసుపాడి మోము తడి యొత్తిన హత్తిన తన్నిశాంకదృ
క్కమలదళాంజనాంకకలకంబుగ నింబగు చేల..... (2-193)

సీ. గోర్వెచ్చచము రంటుకొనిరి మస్తకముల జలకమాడిరి నిశా
మిళిత వారి (3-74)

పై రెండు తావులలో నిశాశబ్దము పసుపునకుఁ బర్యాయముగఁ బ్రయోగింపఁబడెను. ఈకారాంత రజనీశబ్దము ఇకారాంతముగాఁ బ్రయోగింపఁబడునా యనియు శంకింపనక్కఱలేదు. అట్టి ప్రయోగము లశాస్త్రీయములు గావు. ప్రసిద్ధప్రయోగము లెన్నియో గలవు. మన కవియే "శ్రీ షణ్ముఖ జననీ మహి, భాషానిభ నిజవధూ శుభప్రద లీలా" అను పద్యమున 'మహి' యని ప్రయోగించెను. ఇంతయేల ? (5-1)

ఇకారాంతముగా రజని శబ్దమునే క్రిందిపద్యమునఁ బ్రయోగించెను.

క. అని పరమాంసన మిడి తా
నవిమిషు లర్చించినట్లు యర్చించె జగ
జ్జననస్థితిలయకారణ
జని నజునిఁ సుజనమతి రజని రజనీశున్. (4-54)

కావున నిట 'రజనివిలిప్తున్' అను పాఠము యుక్తముగాఁ దోఁచుచున్నది. పరిశీలనము గావించినచో మంచిపాఠము లభింప వచ్చును. అంతదనుక నిది యూహగా మాత్రమే నిలుచును. ని, వి, యను వర్ణముల రూపసన్నిహితత్వమున వ్రాఁతలో నీప్రమాదము కలిగియుండును. అద్దానినే వ్యాఖ్యాతలు గ్రహించిరి.

శివుఁడు పార్వతితో నరసింహుఁడు పౌండరీకక్షేత్రమున రావి చెట్టురూపుతో నున్నాఁడని పలుకు సందర్భము.

క. వరసింహమధ్య ! యచ్చో
నరసింహుఁడు కుంజరాశనతఁ దాల్చుట య
చ్చెరు వద్దేవుఁడు నిజమం
త్రరాజపూజైకతాన తాయుతుఁ బ్రోచున్. (2-124)

టీ. "వరసింహమధ్య = సింహరాజముయొక్క మధ్యమువంటి మధ్యముకల పార్వతీ !, కుంజరాశనతఁ దాల్చుట = రావిచెట్టు రూపు

ధరించుటయు, ఏనుఁగును భుక్తిగా గ్రహించు రూపమును (సింహ రూపమును) ధరించుటయు, [ఇచట 'కుంజరాశనతన్ = అశ్వత్థముచేత, పూర్వటీక. అది సరికాదు.] అచ్చెరువు = ఆశ్చర్యము, నరసింహుఁడు సింహరూపుఁడగుటచే గజభోక్తృత్వమును పొందుట సహజమే కాని యాశ్చర్యముకాదు. ఇచట విరోధము అయినను కుంజరాశనతఁ దాల్చుట = రావిచెట్టురూపు దాల్చుట, అను శ్లేషమూలకార్థాంతరము గ్రహించుటవలన ఆవిరోధము పోవును" అని వ్రాసిరి.

పూర్వటీకను వీరు సరికాదనిరి. కాని వీరి టీకయు సరిగాలేదు. పద్యములోని చమత్కార మీ వ్యాఖ్యవలన దుర్బోధ మగుచున్నది. నరసింహుఁడు కుంజరాశనతఁ దాల్చుట యచ్చెరువు అని కవి వ్రాయఁగా నాశ్చర్యము కాదని వ్యాఖ్యాతలు వ్రాయుట వింతగా నున్నది. అంతియే గాక 'ఇచట విరోధము' అని వ్రాసిరి. ఆశ్చర్యము కానిదాని నాశ్చర్యమనుట విరోధమనియు నర్థాంతరస్వీకారముచే విరోధము పోవుననియు సమన్వయము చేసిరి. ఈ సమన్వయము తప్పు. కుంజరాశన శబ్దమును బహువ్రీహిగా గ్రహించి సింహపరముగా నర్థము చెప్పుకొనుటచే నిందలి యాశ్చర్యము వీరి కవగతము కాలేదు. అలంకార సమన్వయము తప్పినది. దానిని షష్ఠీతత్పురుషముగాఁ జెప్పుకొన్నచో బాగుగా నుండును. నరసింహుఁడు సింహరూపుఁడై యుండియు నేనుఁగుల కాహారమగుట యాశ్చర్యము. ఏనుఁగుల భక్షించు సింహము వాని కాహారమగుట విరోధము. కుంజరాశనతక్ = రావిచెట్టురూపును అని గ్రహించిన విరోధపరిహారము. అశ్వత్థపర్యాయమైన కుంజరాశన శబ్దముయొక్క వ్యుత్పత్తియు దీని కుపష్టంభక మగును.

ఈశ్వరుఁడు పార్వతికిఁ బౌండరీకతీర్థ విశేషములఁ జెప్పు ఘట్టమున నొక పద్యము.

శా. అంశేందూద్వహదేవి హ్రీంకృతిధ్రువం బై యున్న యచ్ఛోటికిన్
ద్రింశద్చాపమితో ర్వి నుత్తరమునం దీపించు తీర్థంబు ముక్

భ్రంశం బొందక నెన్నఁ దత్పులిలధారన్ గూడెఁ బుష్పావళీ
సంశుద్ధాంబువు; లాయెడందగు జపస్నానార్హ్యదానక్రియల్.
(2-126)

టీక. లో "పుష్పావళీసంశుద్ధాంబువులు = పూలతో పవిత్రమైన జలములు" అని యున్నది. దీనికి సందర్భము గానరాదు. ముందుపాదములో నొక తీర్థమునుగూర్చి చెప్పి దానితోఁ గలియు వేఱు జలములనుగూర్చి చెప్పు సందర్భమున "పూలతోఁ బవిత్రములైన జలము" లనుట సంగతముగా లేదు. ఇక్కడ మూలములోని పాఠము సరిగా లేనట్లు తోఁచుచున్నది. పూర్వ (ముద్రిత) గ్రంథటీకలనే వీ రనుసరించిరి. ఈక్షేత్రముననే పుష్పావతీనది ప్రవహించుచున్నట్లు "ప్లావిత భూతలయగు పు, ష్పావతి యను నేఱు గలియఁ బావనమై" యని సంగమతీర్థవర్ణనమునఁ జెప్పబడి యున్నది. (2-157)

కావున దానిజలములే ప్రస్తుతతీర్థమునఁ గూడెనని చెప్పియుండును. ఒకతీర్థమున వేఱొకనది కలియుటచేఁ బవిత్రత యతిశయించును గాన "ఆయెడం దగు జపస్నానార్హ్యదానక్రియల్ అను నుత్తరభాగమున కుపపత్తి పరిపుష్టమగును. 'తీ, ళీ' యనుటకు హేతువు లేఖకులప్రమాదము. కాబట్టి పుష్పావతీసంశుద్ధాంబువు లనుపాఠము సాధువనఁ జెల్లును. అపపాఠ మపవ్యాఖ్యకు మూలమైనది.

పాండురంగనివర్ణనము

తే. నిగమపనాపురములు ప్రమోదము నిరుకుళముగ (2-229)

టీకలో "ఇరుకుళముగ = అడ్డములేక" యని వ్రాయఁబడెను. ఇది నిరుకుళముగాని ఇరుకుళము కాదు. ఇరుకుళము అని విడఁదీయుటచే యతిభంగము వాటిల్లును. 'నిరుకుళ' మను పదమునే నిఘంటువులు గ్రహించి యీ ప్రయోగము నిచ్చినవి. (చూ. శ. ర. సూ. ని.)

నిగమశర్మయందు లగ్నమానసయగు శూద్రవనితకామవికారము వర్ణించు సందర్భమున

ఉ. తేలెడు కన్నుదోయి వడదేలెడు ముద్దుమొగంబు సారెకై
వ్రాలెడు గొప్పకొప్పు వసివాడెడు నన్ను వకాను......(3-65)

టీక......"కైవ్రాలెడు = చేతికి వ్రాలిపోవుచున్న—విడిపోవుచున్న" అని వ్రాయఁబడెను. చేతికి వ్రాలిపోవుట యన నేమో? కై + వ్రాలెడు అని రెండుపదములుగా గ్రహించి యిట్టియర్థము వ్రాసి యుందురు. 'కైవ్రాలు' పదము వ్రాలు పదమునకుఁ బర్యాయముగా నున్నది. "ప్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండ" నని శ్రీనాథుని ప్రయోగము. ఇట్టి ప్రయోగము లింకను గలవు. (చూ—సూ. ని.)

నిగమశర్మ తన్నాపదనుండి కాపాడి యాదరించుచున్న కాఁపు పెద్దను గపటపుమాటలచే మోసగించి వానిసేవల నందె ననుసందర్భమున—

ఉ. తాన ప్రసంగముల్ దిగిచి తత్సరణిన్ దనపెంపు పెద్దగాఁ
బూని వచించు నక్కపటపూరుషు నిక్కము నమ్మి నెమ్మదిన్
జానపదాగ్రగామి తనజాతియుఁ నాతియుఁగూడి దేవు నిం
గా నిజదేశికోత్తముఁగాఁ బరమాప్తునిఁగాఁ దలంచుచున్.(6-58)

టీక—"జానపదాగ్రగామి=పల్లెపట్టులందుండువారిలో ముఖ్యుఁడు—కాఁపుపెద్ద; తానప్రసంగముల్=అధికప్రసంగము; తిగిచి=విడిచిపెట్టి-అనఁగా తా నాబ్రాహ్మణునితో ఎక్కువ మాటలాడక; తత్సరణిన్=అధికప్రసంగపద్ధతిని; తనపెంపు=తానాతని రక్షించి పెంపుట; పెద్దగాన్, పూని=గొప్పగా గ్రహించి; వచించు=మాటాడుపట్టి; అక్కపటపూరుషున్=ఆకుచ్ఛితపువానిని; నెమ్మదిన్=నిండుమనమున; తనజాతియున్=తనశూద్రకులమును; నాతియున్=భార్యయును; నిజదేశికోత్తమునిగాన్=తమగురువువలెను; పరమాప్తునిగాన్=ప్రాణమిత్రుని వలెను; నమ్మెన్." అని వ్రాసిరి. పైవ్యాఖ్య ననుసరించి దీనిభావము నిట్లు గ్రహింపఁదగును. కాఁపుపెద్ద నిగమశర్మతో నధికప్రసంగముసేయక

తానతనిని రక్షించినవిషయము నతఁడే యధికప్రసంగమునఁ బెద్దగాఁ జెప్పుచుండ నా మాయావిని దానును దనవారును భార్యయు గురువుగా దేవునిగా మిత్రునిగా భావించి నమ్మిరి. తానప్రసంగముల్ అనఁగా నధికప్రసంగమను నర్థ మెట్లువచ్చెనో ? తిగిచి=విడిచిపెట్టి యనునర్థము గూడ విచార్యమే. తాను అధికప్రసంగము చేయకుండుటలోఁ గల విశేషమేమి ? మితభాషిగాఁబోలు. నిగమశర్మ తాను గాపాడినవిధము నధికముగాఁ జెప్పినంతమాత్రమున నందుఁ గపట మేమిగలదు ? కాఁపు ఆతనినమ్మటచేఁ బొరపడినట్లు కవి సూచించెను. అది యీ వ్యాఖ్య ప్రకారము సరిగా నిరూపింపఁబడలే దని భావింతును. నాకుఁ దోఁచిన యర్థము వ్రాయుచున్నాను. సహృదయులు గుణదోషములు గ్రహింతురుగాక.

తాను + అ=తానే, ప్రసంగముల్=సంభాషణములను, తిగిచి= తెచ్చి, తత్సరణిన్=ఆప్రసంగధోరణిని, తనపెంపు=తనగొప్పతనము, పెద్దగాన్=అధికముగా, ఘూని=పూనికొని, వచించునకక్కపటపూరు షున్=మాటాడుచున్నట్టి వంచకుని (నిగమశర్మను), జానపదాగ్రగామి= కాఁపుపెద్ద...మిగిలినది పైరీతిగానే చెప్పుకొనఁదగును. మోసగాఁడు తానెవరిని మోసగింపఁదలఁచునో వారితోఁ దానే ముందుగాఁ బ్రసంగము కలుపుట లోకప్రసిద్ధము. 'తాన' అనుటలో నవధారణము మిక్కిలి యుచితము. అట్లే 'తిగిచి' యను పదముకూడ అవకాశము లేకున్నను ఎట్లో ప్రసంగము (లాగుట) ప్రయత్నపూర్వకముగఁ గలుపుట యిందుఁ స్ఫురించును. తానే ప్రసంగము తెచ్చి యందుఁ దనపెంపు పెద్దగాఁ జెప్పుకొన్నవాఁడు గావున నతఁడు కపటపూరుషుఁడనుట. లేని తన గొప్పతనము చెప్పుకొనుట కపటముకదా ! అదియుఁగాక పెద్దగాఁ జెప్పుట, ఘూని చెప్పుట కపటాతిశయద్యోతకములు. ఆగృహస్థుఁడు వీని నెంతగా నమ్మెనో చూడుఁడు. దేవునిగా నమ్మెను. దేశికునిగాఁగాక దేశికోత్తమునిగా నమ్మెను. ఆప్తునిగాఁగాక పరమాప్తునిగా నమ్మెను,

అతిరమణీయమగు నీపద్యమునం బ్రతిపదమును సార్థకము. తన్ను మృత్యుముఖమునుండి తప్పించి తనగాయముల మాన్పి దేవునింబోలె సేవించుచున్న గృహస్థునికోడలినే యపహరించికొనిపోయిన ద్రోహియగువాని వృత్తము వర్ణింపనున్న రామకృష్ణుఁడు తత్ప్రారంభమున నింత యర్థవంతమగు పద్యమును గూర్చెను. వ్యాఖ్యాతలు ముఖ్యభావమునే తాఱుమాఱు చేసివైచిరి. 'ప్రసంగము దిగిచి' అను పదద్వయము ప్రసంగము తెచ్చి యనునర్థమున జైమినిభారతమునఁగూడఁ బ్రయోగింపఁబడెను. (చూ-జై. భా. 4-48, తిరుచు-నూ. వి.)

గ్రామదేవతపండుగును వర్ణించు ఘట్టము

అమ్మహోత్సవము......తమోవికృతివిధేయంబగుట విధు
బింబంబునుం బోలియుఁ దారావియోగముదితంబును,.....

(3-76)

టీక. "...తమోవికృతి విధేయం బగుటన్ = తమోగుణవికారమున కునికిపట్టగుటచేతను—అని మహోత్సవపక్షమునను, చీఁకటి మాఱిపోవుటకు లొంగినదగుటచేత- (చీఁకటిని నశింపఁజేయునదగుటచేత) నని విధుబింబపక్షమునను అర్థము" అని వ్రాసిరి. ఉపమానపక్షమున వ్రాసిన యర్థము బాగుగా లేదు. చంద్రబింబము చీఁకటి మాఱిపోవుటకు లొంగునదగుట యనఁగా భావమేమి? అది బాగుగా లేదని తోఁచి కాఁబోలు "చీఁకటిని నశింపఁజేయునదగుటచేత" నని వ్రాసిరి. ఈ యర్థము పై పదములవలన రాదు. తమశ్శబ్దమున కిచ్చట రాహు వని యర్థముచెప్పుట యుక్తము. రాహువికారమునకు విధుబింబము లొంగుట ప్రసిద్ధముకదా! "తమస్తు రాహు స్స్వర్భానుః" అని యమరకోశము.

నిగమశర్మ యిల్లు దద్ధ మయ్యె నను సందర్భమున.

మాలిని. కుపితశమనచక్షుః క్రూరదుర్వార కీలా
స్ఫుటిత మగుచుఁ బెన్మంట దద్దివాకీర్తియిల్ ప్ర

గ్గిపడియె మధుహాన శ్రీబజాయా తనూజా
తపరిజనయుతంబై దైవదుర్భావదృష్టిన్, (3-90)

టీక. "కుపిత... ...స్థపుటితము, అగు = కోపించిన యముని కన్నులవలని (కన్నులనుండి పుట్టి) తీక్ష్ణమై అస్ఖలితమగు మంటలచే ఆక్రమింపఁబడినదైన" అని వ్రాసిరి. ఈటీకనుబట్టి నిగమశర్మయింటిని గాల్చిన యగ్ని యముని కన్నులనుండి పుట్టినదని తేలుచున్నది. ఇది యసంగతము. 'పుట్టిన' యనెడి యర్థమునిచ్చుపదము మూలమున లేదు. సమాసవృత్తి బలమున నెట్లో యట్టి యర్థమును సాధించినను సారస్యము మృగ్యము. కుపితుఁడైన యముని కన్నులవలెఁ గ్రూరము (తీక్ష్ణము) లయిన వారింపరాని జ్వాలలతోఁ గూడినదని యర్థము చెప్ప నొప్పును. అగ్నిజ్వాలల తీక్ష్ణతాతిశయద్యోతనార్థము కుపితశమనచక్షువు లుపమానములుగా గ్రహింపఁబడినవి. కాని యగ్ని యెక్కడినుండి పుట్టినదో చెప్పుట కవితాత్పర్యము కాదనుకొందును. అతని యిల్లు కాలుటకు ముఖ్యకారణము 'దైవదుర్భావదృష్టి' యని పద్యముననే గలదు. పూర్వటీకలోని ప్రమాదికార్థమును వీరు గ్రహించి పెంచిరి.

పుండరీకుఁడు తనయెదుట నిలిచిన బ్రహ్మతోఁ బలుకు సందర్భమున —

ఉ. త్వాదృశులందు నందకము దాలుచు వేల్పు వసించునట్టు ల
ర్చాదుల నూఁదియుండఁ డని యాడుదుసు......(4-58)

"అర్చాదులన్=పూజ మొదలగువానియందు" అని టీక. ఇది యుక్తముగాదు. అర్చయనఁగా బూజాప్రతిమ యనియును నర్థము కలదు (చూ-సూ. ని.) నీవంటివారిలో నున్నట్లు విష్ణువు విగ్రహములలో నుండఁడని దీనిభావము.

పుండరీకుఁడు భావించుకొను కృష్ణరూపవర్ణనము

సీ.

వక్షఃస్థలమున శ్రీవత్సకౌస్తుభ వైజ
యంతు లిందిరతోడివంతు వడయ

తే. నిమ్ననాభియుఁ ద్రివళివల్గితజఠరము
..........................(4-64)

తేటగీతి పాదమున యతి తప్పినది. "త్రివళివర్ధితజఠరము" అను పాఠాంతరము అధస్సూచికలోఁ గలదు. కాని యందును యతి చింత్యమే. 'వల్గిత'కు బదులు 'మండిత' యని యుండునా? పరిశీలన మావశ్యకము.

పుండరీక తపోవర్ణనమున

చ. కనదరుణప్రభావిభవగర్వ మఖర్వముగా నొనర్చుచుం
దనువు తళుక్కునన్ మెఱవఁ దత్సరసీరుహపంక్తిపేరి ని
చ్చెన వడి నెక్కి నిక్కి నిజజిహ్వకఁ జాఁచి లలాటమధ్యసం
జనితసుధామయూఖసుధ సర్పపురంధ్రిక గ్రోలి సోలఁగన్.
(4-75)

టీకలో-"సర్పపురంధ్రిక=ఉత్తమజాతి నాగుఁబాము" అని వ్రాసి విడిచిరి. 'కుండలిని' యని వ్రాయనిచోఁ బద్యభావము సుగమము కాదు. ఈ ఘట్ట మంతయు యోగవిషయకము గాన నట్టివిశ్కృతి యావశ్యకము.

పుండరీకునకు సాక్షాత్కరించిన విష్ణువుయొక్క వర్ణనము.

దండకము......అంటఁగా రాక        రాకాసుధాభానుభానూజ్జ్వలజ్జ్వాలకీలాకులప్రౌఢరీఢాకృదారూఢగాఢత్విడోఘంబు మోఘంబుగా మేఘవీథిం ధరాధోజగద్ధోరణిన్ దోరణల్ గట్ట......(4-77)

టీక- .. రాకా...ఘంబు-రాకాసుధాభాను = నిండుచంద్రుని యొక్క, భాను=కిరణములనుండి, ఉజ్జ్వలజ్జ్వాల=ప్రకాశించుచున్న జ్వాలయొక్క, కీలాకుల=మంటలచేత కలఁతనొంది, ప్రౌఢరీఢాకృత్=ఎక్కువ అవమానపఱచుచున్న, ఆరూఢ=మీఁదికి లేచుచున్న, గాఢత్విడోఘంబు=అధిక కాంతిసమూహము, మోఘంబుగాన్ = వ్యర్థమగునట్లు, మేఘవీథిన్=గగనమార్గమందు, ధరాధోజగద్ధోరణిన్ = క్రిందిలోకము పందును" అని వ్రాసిరి.

# ఛందోదర్పణము—కొన్ని విశేషములు

## భట్టాచార్య

ఆంధ్రసాహితీలోకమున అనంతునకు అగ్రస్థానము కలదని ప్రతి సాహితీపిపాసికిఁ దెలిసిన విషయమే అతఁడు రచించిన గ్రంథత్రయములో ఛందోదర్పణ మొకటి. అప్పకవీయము తరువాత ఛందోగ్రంథములను పేర్కొనవలసివచ్చిన అనంతుని ఛందమునే పేర్కొనవలయును. దాని కట్టి ప్రత్యేకత కలదనుటలో సందియములేదు. అందలి విషయములు పెక్కింటిని శ్రీ గిడుగు వేంకటసీతాపతి, నిడుదవోలు వేంకటరావు, రావూరి దొరస్వామిశర్మ, వఝ్ఝలమూడి గోపాలకృష్ణయ్య మొదలైన పండితులు విమర్శించి యుండిరి. ఆ విమర్శలు కొన్ని దర్పణమునకు మెఱుగు పెట్టునవిగా నున్నను గొన్ని మాత్రము దోషభూయిష్ఠముగనే యున్నవి. మేమూ ఛందోదర్పణమును విమర్శనాదృష్టిని బరికించు తఱి కొన్ని నిగూఢవిషయములు పొడకట్టినవి. ఆ విషయములు చర్చించు పట్టుల పూర్వవిమర్శకుల విమర్శల నుల్లేఖించుచు మా యభిప్రాయమును దెలుపుదుము.

"ఈ త్రికారంబుకుఁ దృతీయ మెసఁగఁ గ్రింది" అను విషయము మీఁద శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు చేసిన విమర్శ దూరాపాస్తము గావించుచు చేసిన మావిమర్శ జూలై భారతిలో ప్రకటింపఁబడినది. చూడుఁడు.

### 1. ఇంద్రచంద్రాదిగణభేదములు.

కం. ద్వితి చతుర్గురు భవముల
ధాత్రీధర! రెండు మడవఁ దక్కిన గణముల్
మిత్రేంద్ర చంద్రులనఁ జను
మాత్రాదిగణంబు మొదల మాత్రి లిడంగన్.

ఛందో. ప్ర ఆ ప 18

రెండు, మూడు, నాలుగు గురువులను బ్రస్తరించి మాత్రాదిగణము మొదల నొకమాత్ర నిడి మొదటి రెండేసి గణములు తొలఁగించిన గణములో మిగిలిన రెండు, ఆఱు,పదునాలుగువరునగా సూర్య ఇంద్ర, చంద్రగణములగును.

గీ॥ ఒక్క నెలవున నెనిమిది యొకట నాల్గు
రెండి లఘు వెక్కనవి నాల్గు వీనిలోన
నగణపునరుక్తి నొక్కటి డిగియె నాల
దొంతి పదునాల్గు నిరువది తొమ్మిదింట.

ఛందో ప్ర. ఆ ప 20.

ఆంధ్రభాషయందు నుపయుక్తమగు మొత్తము గణముల సంఖ్య యీ పద్యమునందుఁ జెప్పఁబడినది. ఈ విషయమునందుఁగల పండితుల విమర్శలు ముందు చూపించి తరువాత మా యభిప్రాయము తెలుపుదుము. శ్రీ గిడుగు వేంకటసీతాపతిగారు ఛందోదర్పణ పీఠికలో నిట్లు వ్రాసిరి.

"1—20 ఈ పద్యములో నాల్గవపాదము చక్కగా అర్థము కాలేదు. "నగణపునరుక్తి నొక్కటి డిగియె" అంటే చంద్రగణములు ప్రస్తరింపగా కడపటి 11111 (నలలము) ఒక లఘువు తక్కువగా రెండు గణములని అర్థము కావలెను. "ఇరువదితొమ్మిదింట" అంటే అర్థము పొసఁగలేదు. ఛందోదర్పణ పీఠిక పేజీ 43.

యథార్థముగా నీ పద్యమునకు నన్వయము చెప్పుట కష్టముగనే యున్నది. దీనిని విపులముగాఁ జర్చించవలయును. శ్రీ రావూరి దొరస్వామిశర్మగా రిట్లు వ్రాసిరి.

పై పద్యమునకు సీతాపతిగా రూహించినయర్థము సరిపడదు. ఇందులకు సరియగు నర్థము తెల్పెద. ఈ పద్యము గణాష్టకద్వ్యక్షరగణ మార్యేంద్రచంద్రగణములు తెలిపిన తరువాత నున్నది. ఇది యన్ని గణములు చేర్చివచ్చిన సంఖ్యను దెలుపును.

ఒక్క నెలవున నెనిమిది యమరత సభజన—8

ఒకట నాల్గు— గగ, లల, హ, వ— 4

వెండి లఘు వెక్కినవి నాల్గు. సూర్యేంద్రగణప్రస్తారమున మొదట లఘువున్న గణములకు వెండియు ముందు లఘువున్న గణములకు వెండియుముందు లఘువు లుంపవలయును. ఇట్టివి నాల్గు. సూర్య గణముల నగణమున్నది. ఇంద్రగణముల నల, నగ, సలలు మొత్తము నాల్గు వీనిలో "నగణపునరుక్తి నొక్కటిడిగియె" గణాష్టకమునందు నగణమున్నది. సూర్యగణముల నగణమున్నది. నగణపునరుక్తిని దీసి వేయవలయును.—(4—1) 3

ద్రొంతి పమునాల్గు చంద్రగణములు 14

ఈ 29 గణములందే నాల్గైదు మాత్రా గణములు సైతమందం దిర్భవించును. ఆంధ్ర సా. ప, ప సం 38 సంచిక 1-3

శ్రీ గిడుగు వేంకటసీతాపతిగారి వివరణము శర్మగారు చెప్పినట్లు సరిపడలేదేకదా! శ్రీ శర్మగారివివరణము నంతస్పష్టముగా లేదు. "సూర్యేంద్రగణ ప్రస్తారమున మొదట లఘువున్నగణములకు వెండియు ముందు లఘువున్నగణములకు వెండియు ముందు లఘువు లుంపవలయును." అంటే యేమిటి? అర్థమగుటలేదు. వెండి లఘు వెక్కునవి నాలుగేనా యున్నవి? 20 వ, పద్యమునకు మా వివరణ మియ్యాది. ఒక్క నెలవున నెనిమిది—మూఁడు గురువులు ప్రస్తరింపఁగా వచ్చిన గణములు—

(1) మగణము (2) యగణము (3) రగణము (4) సగణము (5) తగణము (6) జగణము (7) భగణము (8) నగణము ఒకట నాల్గు. రెండుగురువులు ప్రస్తరింపఁగా వచ్చినగణములు.గగ,లగ, గల లలములు. "వెండిలఘువెక్కినవి నాల్గు. వీనిలోన నగణపునరుక్తి నొక్క

టిడిగియె” ఇదియేవిచారణీయము. లఘువెక్కిన వనఁగా మాత్రాదిగణ ములమొదల మాత్రలు చేర్చవలయును. అట్లు చేర్చవలసినవి నాలు గేనాయున్నవి? రెండు మూఁడు గురువులు ప్రస్తరించినపుడు మాత్రాది గణములు ఆఱు ఏర్పడుచున్నవిగదా. ఆయాఱుమాత్రాదిగణముల ముందు నొకమాత్ర నిడకుండ రెండుగణములు వదలి మిగిలిన నాలుగు గణములకుమాత్రమే మాత్రలెక్కింపనేల ? నాలుగు గణములముందు మాత్రలెక్కించిన గణములు రెం డేర్పడగా నొకటిత్రోలఁగింపవలయునని యేల చెప్పవలయును? సగణ, నగణ, జగణములు మొదట మాత్రలు గలవి. వీనిముందు మాత్రలెక్కించి గణించిన సరిపడియెడిదిగదా. లలము ముందును మాత్రనెక్కించిన నగణము కాఁగా దానిని మఱల యెందుకు పరిహరించుట ? మిగిలిన యగణలగములముందు మాత్రలు వెట్టిన ప్రయోజనము లేనివి కనుక పరిహరింపవచ్చును. అనఁగా యగ ణము ముందు లఘువుచేర్చిన నగురువు అగుచున్నది. ఇది నిష్ప్రయో జనగణము. లగముముందు లఘువు సేర్చిన సగణము కాఁగలదు. ఇది యెనిమిదిగణములలోనున్నది. అందువలన “ వెండిలఘువెక్కినవి నాల్గు పినిలోన నగంపునరుక్తి నొక్కటి డిగియె” అని యనంతుఁడు సెప్పుట సరిపడినదికాదు. తరువాత దొంతిపదునాల్గు. ఇవి నాలుగు గురువులు ప్రస్తరించి మాత్రాదిగణము ముందు మాత్ర నిడి మొదటి రెండుగణములు త్రోలఁగించిన పదునాలుగు చంద్రగణము లేర్పడుచు న్నవి. నాలుగు గురువులు ప్రస్తరించినపుడు పదునాఱు గణము లేర్ప డుచున్నవి. మొదటి రెండు గణములు త్రోలఁగించవలయు నని యిరు వదియవ పద్యమునందుఁ జెప్పలేదు. అందు పదునాల్గని చెప్పుటచేతనే పదునాఱుగణములలో మొదటి రెండుగణములు అక్కఱకు రానివికనుక పదునాలుగే గ్రహింపవలయునని చెప్పుకొనవలయును.

మొత్తము 29 గణములు.

అనంతుని పద్యము క్లిష్టముగానున్నది. ఆపద్యమిట్లున్న బాగుం డెడిని.

గీ. ఒక్క నెలవున నెనిమిదియొకట వాల్గు
వెండి లఘువెక్కినవి మూఁడు విశ్వనాథ!
దొంతి పదునాల్గు నిరువదితొమ్మి దాంధ్ర
భాష నుపయుక్తమౌ గణపంక్తి చూడ.

అనంతుని పద్యమునకే అన్వయము చెప్పవలసిన నిట్లు చెప్పుకొనునది.

ఒక్క నెలవున నెనిమిది (మూఁడు గురువులు ప్రస్తరింపగా వచ్చినగణములు)

మ, య, ర, స, త, జ, భ, న 8

ఒకటవాల్గు (రెండుగురువులు ప్రస్తరింపగావచ్చినవి)

గగ, లగ, గల, లల—

వెండిలఘువెక్కినవి వాల్గు (నగణ, జగణ సగణ లలములు మొదటలఘువులుగలవి కనుక వీనిముందు ఒకలఘువును జేర్చిన వచ్చిన గణములు. మొదటి యెనిమిదిగణములలో నగణ మున్నది. కాన లలము ముందు లఘువు సేర్చిననేర్పడిన నగణమూ పరిహరింపవలయును) వీనిలోన నగణపునరుక్తి నొక్కటిడిగిరె.

నల, నగ, సల (4—1—3

దొంతిపదునాల్గు (నాలుగు గురువులు ప్రస్తరింపఁగా పదునాఱు గణములు పుట్టుచున్నవి. వీనిలో మాత్రాదిగణముల ముందు మాత్ర లుసేర్చి మొదటిరెండుగణము లనుపయుక్తములు గనుక వానిని తొలఁ గించగా మిగిలిన గణములు).

నగగ,- నహ,స లల,-భల,భగురు, మలఘు,- సవ, - సహ,- తల,- రల,- నవ-, నలల-,రగురు,- తగలు- 14.

మొత్తము గణములు 29.

ఇట్లు చెప్పికొన్నచో 1-20 వ పద్యమునకు అన్వయము సరిపడును.

2. సమప్రాసము.

క. పరువడి బ్రాసములు సమా
క్షరసంశోభితము లైనఁ జాలును మఱి త
త్స్వర వై సాదృశ్యంబులు
పరిహారణీయంబు లందుఁ బంకజనాభా!

ఛందో ప్ర. ఆ. ప. 37.

పాదమునందలి మొదటి యక్షరము యతి అని రెండవయక్షరము ప్రాసము అని చెప్పఁబడినదికదా. యతులకు హల్సామ్యమేకాక స్వరసదృశత్వముకూడ తప్పకయుండవలయును. కాని ప్రాసమున కా నియమములేదు. మొదటిపాదమునందు నేహల్లుతో బ్రాసమును బ్రారంభించితిమో నాలుగుపాదములందు నాహల్లే యుండవలయును. స్వరసామ్య మక్కఱలేదు. పై నిఁజెప్పిన పద్యమునందలి మొదటిరెండు పాదములు ఈ విషయమునే చెప్పెను. మూఁడునాలుగుపాదములు స్వరసాదృశ్యముకూడ నుండవలయు నని మఱల నియమించుచున్నవి. కాని యయ్యది సరికాదు పాఠముత ప్పున్నది. తత్స్వరసాదృశ్యంబులు పరిహారణీయంబులు అని చెప్పిన సరిపోయెడిదే కాని యందు 'వై' అను ఉపసర్గాక్షరమున్న కారణమున నది యిట్లుండవలెను. "తత్స్వర వై సాదృశ్యంబు లపరిహారణీయంబులు" అనియున్న చక్కఁగా సరిపడును. ఆ పద్యమి ట్లుండఁదగును.

క. పరువడి బ్రాసములు సమా
క్షరసంశోభితములైనఁ జాలును మఱి త
త్స్వర వై సాదృశ్యంబు ల
పరిహారణీయంబు లందుఁ బంకజనాభా!

ఇయ్యదియే సరియగుపాఠ మని మాయభిప్రాయము.

3. సంయుత ప్రాసము.

ఆ. వె. పాదు నూరు ప్రోలు బహువచనంబులై
పరగుచుండ నూఁది పలుకు నపుడు
తేల్చి పలుకునప్పుడు దీపించు సంయుత
ప్రాస మిరు తెలుఁగులఁ బద్మనాభ!

ఛందో, ప్ర. ఆ. ప 55.

అనంతామాత్యుఁడు పాదు, ఊరు, ప్రోలు, అని మూఁడు పదములనే పద్యమునందు నిర్దేశించి లక్షణము సెప్పినను ఉపలక్షణముగా గాదు, కూడు మొదలైన పదములను గ్రహింపవలయును. అట్లెందు కుపలక్షణముగా గ్రహింపవలయునో చర్చించెదము.

"బహువచనంబు పరంబగునప్పు డసంయుక్తంబులయిన డలరలల కలఘులకారంబు బహుళంబుగా నగు" అను బాలవ్యాకరణ సూత్రముచే పాదు, ఊరు, ప్రోలు శబ్దములు పాళులు, ఊళులు, ప్రోళులు, అని తేల్చి పలుకు రూపములుగాను "బహువచనశ్లిష్టంబు లయి యద్విరుక్తంబు లయిన డకారలకారముల కలఘులకారంబు నిత్యంబుగా నగును" అను సూత్రముచే పాళ్ళు, ఊళ్ళు, ప్రోళ్ళు, అని యూది పలుకురూపములు నగును. ఊది తేల్చిపలుకు రూపముల ప్రాసలు సంయుత ప్రాస లను పేరుతో నొప్పుచుండును. దీని కుదాహరణముగా ననంతుఁ డీక్రింది పద్యమును జెప్పినాఁడు.

ఆ. వె. పాళ్ళు మనుజు లెక్క నూళ్ళుగాఁ దొడఁగెన
యూర్వాళ్ళు మిగుల బలిసెఁ బ్రోళ్ళుగాఁగ
భాగ్యవంతుఁ డేలు పాళ్ళను నూళ్ళను
బ్రోళ్ళ నయ్యెబ్రాతె కూళ్ళిచటను.

ఛందో, ప్ర. ఆ. ప 56.

పై పద్యమునందించుక పొరపాటున్నది. ఊది పలుకు దాని కుదాహరణము లున్నవి కాని తేల్చి పలుకునట్టి దానికి నుదాహరణములు కనిపించుట లేదు. పై పద్యమునందలి మూఁడునాలుగుపాదముల నించుక సవరించిన సరిపడియెడి.

భాగ్యవంతుఁడేలు పాళలు నూళలు
ప్రోళలయ్యె బ్రాతె కూళ లిచట.

పాళ్ళు, ఊళ్ళు, ప్రోళ్ళు, అని యూది పలుకునట్టిరూపములుగాక పాళలు, ఊళలు, ప్రోళలు అని తేల్చి పలుకునట్టి రూపము లున్న సరిపోఁగలదు. అనంతుఁడు సంయుత ప్రాసమునకు నుదాహరణముగా నిచ్చిన యీ పద్యమునందు పాడు, ఊరు, ప్రోలు అను మూఁడు పదములనే కాక 'కూడు' అను పదమునుగూడ గ్రహించినందున ఉపలక్షణముగా నా మూఁడు పదములనే కాక మిగిలిన త్రాడు, కూడు మొదలైన పదములను గూడ గ్రహింపవలయు నని చెప్పవలసియున్నది. అట్లు కానిచో కూళ లని యుదాహరించుట తగదుగదా.

4. నిత్యసమాసయతి

గీ. అఱ యనంగను పోవుట కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి జరుగు రెంట
ననురవీరుల నెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని సేపఱచె ననఁగ.

ఛందో. ప్ర.ఆ.ప. 100

ఈ పద్యమునందలి మొదటిపాదమునుగూర్చి పండితులలోనె యభిప్రాయభేదములు కలవు. వానిని వరుస వివరించి మాయభిప్రాయమును దెలుపుదుము. అనంతుఁడు నిత్యసమాసయతినిగూర్చి పై పద్యమునందు లక్షణలక్ష్యముల నిచ్చియున్నాఁడు. అనంతుని యభిప్రాయ మియ్యది. 'నశించుట' అను అర్థమును జెప్పునట్టి 'అఱు' అను

ధాతురూపములు సంధి కలిసి అచ్చుతోను హల్లుతోను యతి చెల్లు నని చెప్పినారు. అందులకు నుదాహరణములుగా — "అసురవీరుల నెల్ల నుక్కఱ వధించె" ఇందు అసురలోని అకారమునకును ఉక్కఱ- ఉక్కు+అఱ అని సంధి విడదీయగా వచ్చిన స్వరమునకు మైత్రి చెప్పఁబడినది. "భానుకులుఁడు రావణుని నే పఱచె ననఁగ" ఇందు భాను లోని భకారమునకును, ఏపఱచె (ఏవు+అఱచె) సంధివశము చేత నయిన పకారమునకును యతి చెప్పఁబడినది. "అఱయనంగను పోవుట కర్థమైన" అను పాదమునందు గల పండితులయభిప్రాయములు వరుసగాఁ దెలుపుచుంటిమి. పరికింపుఁడు.

"అఱ యఱను పోవుట నర్థమగుట నట్టి
సంధి నిత్యసమాసోక్తి జరుగు వఱలు
అసుర వీరులనెల్ల నొక్కట వధించె
భానుకులుఁడు రావణుని యేపఱచె ననఁగ"

అను గీతపద్యము మొదటిముద్రణమునం దున్నదనియు రెండవ ముద్రణమునందు—

అఱయనంగను పోవుట కర్థమైన
సంధి నిత్యసమాసోక్తి జరుగు రెంట
నసురవీరులనెల్ల నుక్కఱ వధించె
భానుకులుఁడు రావణుని నేపఱచె ననఁగ.

అను పాఠము అప్పకవీయమునుండి గ్రహింపఁబడినదనియు ఛందోదర్పణము ఇరువది రెండవ పేజీ క్రిందిభాగమున వ్రాయఁబడి యున్నది. ఇది శ్రీ గిడుగువారి పాఠము. అప్పకవీయవివరణ కర్తలు మా గురువులైన బ్రహ్మశ్రీ వేదుల రామశాస్త్రిగారు గిడుగు వారి పాఠమైన 'అఱయనంగ' అనునెడ 'అఱనసంగ' అని యుండ వలయుననియు నిక్కమునకయ్యది అఱుధాతువనియు దానికి అన్నంత

రూపములోని "అఱక్" అనుదానిని గ్రహించి వ్రాసిన "అఱవనంగ" అనియె యుండవలయునని వ్రాసిరి.

"అఱయనంగ" అనుగిడుగువారి పాఠమును, 'అఱననంగ' అను వేదులవారి పాఠమును తగవని శ్రీ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్య గారు—

"గిడుగువారి యడాగమయుతరూపము మొదటనే తగనిది కదా. ఇఁక అప్పకవీయ వివరణకర్తలపాఠము పరిశీలింతము. వారు రచించిన పాఠమిది. "అఱుననంగను బోవుట కర్థమైన" అని. నిజముగా ననంతుఁ డీపాఠమును వ్రాసియుండడని మాయాశయము. ఏలయన పూర్తిగా నర్థదోషమున్నది. 'అఱక్' పోగా అను నర్థము గల అన్నంతరూపమునకు నాఁతఁడు 'పోవుట' అని భావార్థము చెప్పఁ డని మా వినతి. 'అఱన్' అనుదానికి 'పోఁగా' అనికాని 'పోవుచుట్లు' అనికాని షష్ఠ్యర్థముగాని చెప్పుట యుక్తము కాని అన్నంతమునకు ధాతుభావార్థముం జెప్పుట తగనిది. దీనిఁబట్టి అప్పకవీయవివరణ కర్తలు గిడుగువారిని దిద్దబోయి తా మొనర్చిన సవరణ నిస్సారము, దోషభూయిష్ఠమునై యున్నయది" యని మా యాశయము. ఇఁక నట మాకు దోచిన పాఠముఁ జూపుదుము. అట 'అఱు అనంగను బోవుట కర్థమైన" అని యుండవలయునని మా యాశయము. అట ధాతువును విశేషముగా నిర్దేశించి యర్థము చెప్పుచున్నాఁడు కావున సంధి చేయకపోయినను దోష మిసుమంతయు నుండదని మా వినతి. ఇట 'సంధిర్వా చోచ్యమతి' అను సూత్రముచే నిత్యసంధి చేయవలసి యుండ విశేషముగా నిర్దేశించుటంజేసి సంధిలేమకాని యడాగమము మాత్రము పెట్టరాదు. ఈ విషయమునకుఁ గించిత్ప్రోద్బలకముగా నప్పకవీయమున నొక పద్యము చూపుదుము.

ఆ॥ వె॥ అప్ప అయ్య అన్న అరుసవ్వ అమ్మకు—
ఆయి యను పదంబు లమరు సంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామాఖండ
వళు లనంగ నూఁదఁ బడక స్థైన.

అప్పక॥ తృ॥ ఆ. ప 221.

ఇందప్పకవియు అప్ప+అయ్య అన్న+అరుసవ్వ అనునెడ ఆర్యాంబా ద్యర్థముల కచ్చు పరఁబగుచో సంధినిత్యమైయుండవిశేషముగా శబ్దనిర్దేశముం జేయుటకతన సంధి చేయలేదని మాయాశయము. ఇవ్విషయమున పండితవిమర్శకు లెల్లరు విషయ సత్యగ్రహణ మొనర్ప ప్రార్థితులు. ఇట్లే యనంతుఁడును 'ఆఱు అనంగ' అనియే వ్రాసి యుండుననియు నయ్యది విసంధిదోషముగా నెంచి యజ్ఞులు దిద్దివైచి యుందురనియు మా యాశయము.

ఆంధ్రసా, ప, ప, సం 39. సంచిక 1-3.

అని యొక సుదీర్ఘమైన దోషభూయిష్ఠమైన విమర్శ కావించిరి. అందులో గోపాలకృష్ణయ్యగారు చేయు సవరణ యొక వింతైనది. విసంధిదోషభూయిష్ఠమైన 'ఆఱుఅనంగ' అనునది అనంతుని ప్రయోగమనియు నయ్యాని యజ్ఞలు దిద్దియుందురనియు చెప్పుట పరమసాహసము. 'ఆఱుఅనంగ' అను దిద్దుబాటులో గోపాలకృష్ణయ్యగారి యజ్ఞత్వము కావలసినంత వెల్లడి యగుచున్నది. తమ విసంధిదోషభూయిష్ఠమైన ప్రయోగమును గప్పిపుచ్చుకొనుటకు ఆ దోష మినుమంతయు లేని 'అప్ప అయ్య' అను పద్యమును జూపుట ఆ యజ్ఞత్వము ఇబ్బడి ముబ్బడి యైనది. పై విషయముమీఁద శ్రీ గిడుగు, వేదుల, వడ్లమూడి వారల ప్రతిపాదితవిషయములఁ బరిశీలించి మా యభిప్రాయమును దెలుపుదుము.

'అఱయనంగ' ఇది శ్రీ గిడుగువారి పాఠము. అఱ్ఱ + అనంగ అనియుండును. అన్నంతరూపముమీఁద శ్రీ వేదులవా రనునన్నట్లు యడాగమము రాదు. అందుచే గిడుగువారి యడాగమపాఠము (అఱ యనంగ) సరికాదుకదా. ఇఁక వేదులవారి పాఠమును బరికింతము "అఱ నసంగను బోవుట కర్థమైన" అఱ్ఱ అను అన్నంత రూపమునకు భావార్థము చెప్పఁ డనియు 'అఱన్' అను దానికి పోగా అని కాని, పోవునట్లు అని కాని షష్ఠ్యర్థముగాని చెప్పుట యుక్తమని చెప్పిన గోపాలకృష్ణయ్యగారి దానిని బట్టి యయ్యది సరికాదందుము. ఇఁక గోపాలకృష్ణయ్యగారు చెప్పిన పాఠమును బరికిలింతము.

"అఱు అసంగను బోవుట కర్థమైన"

అఱు + అసంగ అని విసంధికముగాఁ జెప్పి ధాతువును విశేషముగా నిర్దేశించి యర్థముం జెప్పుచున్నాఁడు కావున "సంధిర్నా చోచ్యనుత" అను సూత్రముచే సంధి కావలసియున్నను సంధి చేయలేదనియు నంధి చేయలేదు కనుక "సంధి లేనిచో స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకు యడాగమంబగు" అను సూత్రముచే యడాగమము చేయవలయునందు రేమో యని శంకించి "అట యడాగము మాత్రము పెట్టరాదు" అని చెప్పినారు. ఇది యంతయు శ్రీ వడ్లమూడివారి స్వోపజ్ఞ. వారి స్వోపజ్ఞకు అప్పకవి పద్యము ప్రోద్బలకముగా నున్నదఁట. ఇది చాల వింతగ నున్నది. చూడుఁడు—

ఆ॥ వె॥ అప్ప అయ్య అన్న అరుసవ్వ అమ్మక్క
అయి యను పదంబులదుకు సంధు
లుభయమునకుఁ జెల్లుచుండు నామూఖండ
వశలనంగ నూఁదఁ బడకయైన

అప్పక॥ తృ॥ ఆ॥ ప॥ 221

ఇందప్పకవి అప్ప+అయ్య, అన్న+అరుసవ్వ (అరుసవ్వ అనునది గోపాలకృష్ణయ్యగారు ఏకపదముగనే చూపించిరి) అనచోట ఆర్యాంబాద్యర్థముల కచ్చు పరంబగుచో సంధి నిత్యమైనను విశేషముగా శబ్దనిర్దేశము చేయుటచే సంధి రాదని ప్రవచించిరి. అదియునుగాక పై పద్యమునందలి పదములను విడదీసి వ్రాయుతఱి గోపాలకృష్ణయ్యగారు 'అరుసవ్వ' అని యేకపదముగనే చెప్పిరి. అమ్మక్క-అమ్మ+అక్క అను పదములను జూపింప లేదేమనుచేతనో. ఇఁక అప్ప+అయ్య+అన్న అను తావుల సంధిరాకపోవుట "శ్రేష్ఠతా వాచకంబులగు నార్యాంబాద్యర్థక శబ్దంబులు పరంబులగుచో నన్నియచ్చులకు సంధి నిత్యము" అను ప్రౌఢ వ్యాకరణ సూత్రముచే సంధి రావలసియున్నను విశేష శబ్ద నిర్దేశముచే సంధిరాలేదని చెప్పుట వింతగా నున్నది. ప్రౌఢ వ్యాకరణమునందలి 'ఆర్యాంబాద్యర్థ' అను సూత్రమున కచట ప్రసక్తియే లేదు. దీనిని గోపాలకృష్ణయ్యగారు గుర్తింపలేదు. ఈ సూత్రము నామవాచకములే యంతములైనను ఆర్య, అంబ అర్థములను జెప్పునట్టి పదములు (అయ్య—అమ్మ మొదలైనవి) పరమగునపుడు సంధి నిత్యమని చెప్పినాఁడు గాని అప్ప—అయ్య అన్న—ఇట్టి విషయములందు నా సూత్రమునకే మాత్రము తావులేదు. ప్రౌఢ వ్యాకరణమునందలి యుదాహరణములు చూచిన నిది స్పష్టము కాఁగలదు. రామ+అయ్య=రామయ్య లక్ష్మి+అయ్య=లక్ష్మయ్య— లక్ష్మి+అమ్మ=లక్ష్మమ్మ—సూత్రమునందలి ఆదిశబ్దముచే అన్న—అక్క మున్నగునవియు గ్రహింపవలయును.

ఇఁక అప్ప+అయ్య+అన్న—అనుచోట సంధి రాకపోవుటకు "అత్తునకు సంధి బహుళంబుగానగు" అను సూత్రముచే బహుళంబుగా సంధి కావచ్చును. అప్ప+అయ్య=అప్పయ్య—అప్పయయ్య. అయ్య+అన్న=అయ్యన్న—అయ్యయన్న అని సంధి లేనిచోట యడాగమము

చేసియు బ్రయోగింపవచ్చును. కాని స్పష్టముగా నుండుటకు అప్పకవి తన పద్యమునందు యడాగమ రహితముగాఁ జూపించినాఁడు. అప్పకవి పద్యమునందలి మొదటి పాదమునందు గణానుసారముగా సంధి చేయకయు, సంధిచేసియుఁ బ్రయోగించినాఁడు. "అప్ప అయ్య అన్న అరునవ్వ అమ్మక్క" ఇందలి మొదటి మూఁడు పదములు సంధిచేయనివి. తరువాతి రెండు పదములు సంధిచేసినవి. 'అరునవ్వ' విషయమును దరువాత తెలిపెదను. "అమ్మక్క" ఇందు రెండు పదములున్నవి. వఝ్లమూడివారు మొదటి మూఁడు పదములు మాత్రము విడదీసి చూపించి ('అరునవ్వ' అనునది యేకపదముగనే చూపించి రనుకొండి) 'అమ్మక్క' అను సంధిచేసిన పదమును జూపింపని కారణమేమి? తాము ప్రతిపాదించిన విషయమునకు బాధాకరముగా నుండుననియా? అమ్మ+అక్క అని రెండు పదములుగదా. అప్పకవి కట ఇంద్రగణములు కావలసి వచ్చినవి. అందుచే 'అమ్మక్క' అని సంధిచేసి ప్రయోగించినాఁడు. అమ్మక్క (అమ్మ+అక్క) అనునదియే మొదట ప్రయోగించినట్లైన అమ్మ అక్క అన్న అరునవ్వ అయ్యప్ప: అని విసంధికముగ బ్రయోగించి యుండెడివాఁడే. తేలిన సారాంశమేమన అకారాంత పదములైన అయ్య, అప్ప, అన్న, అమ్మ, అక్క, అవ్వ, అను పదములను గణానుసారముగా సంధి చేయవలసినచోట సంధిచేసి అక్కఱలేనిచోట విసంధికముగనే బ్రయోగించినాఁడు. సంధిలేనిచోట యడాగమము సేసియు బ్రయోగింపవచ్చును బాధలేదు. ఇఁక 'అరునవ్వ' అను విషయమును బరిశీలింతము.

'అరునవ్వ' అని యేకపదముగనే గోపాలకృష్ణయ్యగారు చూపించిరి. అట్లెందుకుఁ జూపించిరో బోధపడకున్నది. తెలియకయా? లేక స్ఫురింపకయా? అది రెండు పదముల కూడిక కదా. అరును+అవ్వ= అరునవ్వ—అని సంధి. తిమ్మ+అరును=తిమ్మరును, 'అరును' అనునది

ఉకారాంత పదము. ఇది తప్పక సంధిచేసి ప్రయోగింప వలసినదే. అరుసు+అవ్వ=అరుసవ్వ—అని యప్పకవి సంధిచేసియే ప్రయోగించినాఁడు. ఇట్టి పదప్రయోగములను దీసికొని 'అఱు అనంగ' అను విసంధిదోషపూరితమైన దానికి ప్రోద్బలకముగా నున్నదని గోపాలకృష్ణయ్యగారు చెప్పుట అనాలోచితము. తాను ఉకారాంతపదమును (అఱు+అనంగ) విసంధికముగాఁ జూపించుచు బహుళముగా సంధిచేయుట కవకాశమున్న 'అప్ప అయ్య అన్న' అను పదములు సంధి చేయలేదు చూడుఁడు అని చెప్పుట చాల పొరపాటు తన 'అఱు+అనంగ) అను ప్రయోగమునకు 'అరుసు+అవ్వ' అని విసంధికముగా నప్పకవి ప్రయోగించిన సహాయకారి యయ్యెడిదే. కాని యప్పకవి విసంధికముగా నెట్లు ప్రయోగించును! అనంతుఁడును అప్పకవి చెప్పినట్టిదితనఛందోదర్పణము నందు సంధిచేసి ప్రయోగించినాఁడు.

గీ॥ ఒరుల నన్నమ్మ యనుచోట నూఁదఁబడక
ద్వివిధమగుఁ బ్రభు నామాంత విరమణంబు
మహీనయోధ్యకు రాజు రామన యనంగ
నతని పట్టపుదేవి సీతమ యనంగ.

(అనంతుఁడు లక్షణమునందు 'అన్నమ్మ' (అన్న+అమ్మ అని రెండు పదములనే చెప్పినప్పటికి ఉపలక్షణముగా అయ్య అప్ప మొదలైన పదములను గ్రహింపవలయును) అనంతామాత్యుడు పై పద్యమునందు విశేషముగా అన్న, అమ్మ లను పదములను నిర్దేశించి చెప్పుచున్నను విసంధికముగాఁ బ్రయోగింపక సంధిచేసి ప్రయోగించినాఁడు. విశేషముగా శబ్దమును నిర్దేశించి చెప్పినపుడును, అనంతుఁడు—అప్పకవి లాక్షణిక ద్వయమును సంధిచేసి ప్రయోగించిరి కాని యట్టి తావుల గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు విసంధికముగా ప్రయోగింపలేదు. దీనిని బట్టి 'అఱు+అనంగ' అను గోపాలకృష్ణయ్యగారి సవరణ దోషభూయిష్ఠము

గావున నయ్యాని సరికాదు. ఇట్టి దోషపూరితమైన ప్రయోగమును అనంతునకు నంటగట్టుటకుఁ బ్రయత్నముసేసి అనంతుఁడును 'అఱు అనంగ' అనియే వ్రాసి యుండుననియు నయ్యాని విసంధి దోషముగా నెంచి యజ్ఞులు దిద్దివైచి యుందురనియు మా యాశయము" అని వడ్లమూడి వారు వ్రాయుట మహాశ్చర్యము. ఇఁక మా యభిప్రాయమును దెలిపెదము.

"అఱు ననంగను బోవు ననర్థమైన" అని యుండవచ్చును. 'అఱును' అను తద్ధర్మార్థక రూపము గ్రహించితిమి దానికి అర్థము పోవును, నశించును అని. అఱు ధాతురూపము లన్నియు (రూపు+అఱుట, రూపు+అఱె, రూపు+అఱెను, రూపు+అఱును మొదలైనవి) నిత్య సమాసయుతములుగాఁ జెల్లును.

5 పురుష సింహో యనంగ.

గీ॥ ఓలిఁ బురుషసింహో యని యుగ్గడించు
చోటఁ దా సింహ ఇవపురుషో యనంగఁ
దనరు విగ్రహమగుట నుత్తరపదోప
మా సమాసమండ్రిది శాస్త్రమహిమవిదులు.

ఛందో॥ ఆ 4. ప 104.

ఇందు 'సింహ ఇవపురుషో యనంగ' అనునది చర్చనీయాంశము. "లోపోనమ ఆదికే విసర్గస్య" అను సూత్రముచే పురుషఃలోని విసర్గము లోపింప వలసియుండఁగా "నమశ్శబ్ద విసర్గస్య లోప ఓత్వమ పీష్యతే" అను సూత్రముచే అనుకరణమునందు నమశ్శబ్దమునందలి విసర్గకు ఓత్వము వచ్చినట్లు పురుషఃలోని విసర్గకు కూడ ఓత్వము చెప్పఁబడి యుండును. అదియును గాక వ్యాకరణ నియమము లంతగా నిట్టి తావులందు పట్టింపులేదేమో. ఎందువలనన చిన్నయసూరి తన బాల వ్యాకరణమునందు పదు+ఐదులు—పేను+ఐదులు...పడ్వాదులు, పేర్వా

దులు అని తెలుఁగు సంస్కృత పదములకు యణాదేశసంధి చేసినాఁడు. వ్యాకరణ శాస్త్రమునందే యవి వ్యాకరణ దోషములుగా నప్పుడు, ఛందశ్శాస్త్రమునందలి దోషములు, దోషములు కానక్కఱ లేదు. అనుకరణమునందు విసర్గకులోపము రావలసియుండ సమశ్శబ్దమున వలె ఓత్వమువచ్చి "సింహా ఇవపురుషో యనంగ" అని యయినది. ఇయ్యది యిట దోషముగాదు కాని విశేష ప్రయోగమని చెప్ప వల యు

ఈ విషయమును గూర్చి శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగా రిట్లు వ్రాయుచున్నారు. "పురుషసింహాః అనియు, సింహా ఇవపురుషః అనియు విసర్గాంతములుగనే యుంచవలయును. పురుషసింహాః, సింహా ఇవపురుషః అని యీ పదములు పాఠకుల సులభబోధకై విశేష నిర్దేశము చేయుచుండుట కతన విసర్గలోపము (అనుకరణము చేయకయ) చేయక యుంచెనని చెప్పనగు. పదముల ప్రత్యేకతో నిర్దేశించు తఱి సంధి కార్యములు కలుగకుండుట దోషముకాదు. దీనికి అప్ప, అయ్య, అన్న, అనివిసంధికముగానప్పకవీయము తృ,221 లో ప్రయోగించుటయే ప్రబల సాక్ష్యము. (చూడుఁడు ఆ, సా, ప, పత్రిక స 39 సంచిక 1-2) కాగా పురుషసింహాః సింహాఇవపురుషః అని విసర్గాంతములుగ నుండు టయు సంభవమే. ఎంతైనను నర్థసందర్భమున వానిని విసర్గాంతపదము లుగఁ దీయవలయు నంతియుకాక యోదంతములగుట అంతగాఁ బ్రసి ద్ధముకాదు. (సమశ్శబ్దము తప్ప) ఏతత్కారణములుగా వానిని ఓదంత ములుగఁ గాక విసర్గాంతములుగా నుంచుటయే లెస్స యని మా యభి ప్రాయము.

పురుషసింహో, సింహాఇవపురుషో అనుటలో లేని సారస్యము పురుషసింహాః, సింహాఇవపురుషః అనుటలోనే మిక్కిలి యుండఁగలదు.

సింహ ఇవ పురుషః, పురుషసింహః అని విసర్గాంతములుగా సర్వజన వ్యవహార ప్రసిద్ధముగాన అనంతుఁడు నట్లే లిఖించి యుండునేమో."

సూత్రప్రాయముగాఁ జెప్పవలయునంటే శ్రీ వడ్లమూడి వారి విమర్శ "బూరగింపుల బుంగ" అని చెప్పనగు. వారి విమర్శపై మా విమర్శ పరికింపుఁడు. శ్రీ గోపాలకృష్ణయ్యగారు ఓదంతముల కంటె విసర్గాంతములందే యెక్కువ సారస్యముండుననియు, పాఠకుల సులభబోధకై విశేషనిర్దేశము చేయుటకై తన విసర్గలోపము సేయక యుంచెననియు పదముల ప్రత్యేకముగా నిర్దేశించుతఱి సంధి కార్యములు చేయకుండుట దోషముకాదనియుఁ, జెప్పి దానికి నుదాహరణముగా అప్పకవీయము నందలి అప్ప, అయ్య, అన్న అను ప్రయోగములను జూపించిరి. కాని యివెంతయు దూరాలోచనలేక చెప్పిన వాక్యములు. ఏలన అనంతుఁడు యతిస్థానములో దానిని ప్రయోగించి యున్నాఁడు. చూడుఁడు. "చోటఁ దా సింహఇవ పురుషోయనంగ" చోటలోని చోవర్ణమునకును, పురుషోలోని షో వర్ణమునకును యతి వేయఁబడినది. దీనిని విసర్గాంతముగాఁ జేసిన యతి తప్పునుగదా. దీనిని బట్టి యనంతుని ప్రయోగము విసర్గాంతము కాక ఓదంతమేకదా. అదియును గాక "స్థితస్య గతిశ్చింతనీయా" అని కదా పెద్దల వాక్యము. దానికి భిన్నముగాకవికి దోషము లంటఁగట్టుట మహాపచారము. అనంతుని మతమున నవి ఓకారాంతములనియు సమశ్శబ్దమువలె నట చెప్పికొనుట లెస్స యనియు మా యభిప్రాయము. "పదముల ప్రత్యేకతతో నిర్దేశించుతఱి సంధి కార్యములు కలుగకుండుట దోషముకాదు" అని చెప్పి దానికి నుదాహరణముగా అప్ప అయ్య అన్న అను పదములను జూపించుట అనాలోచితము. దీని మేము "అలు+అనంగ" అను విషయము దగ్గఱ విపులముగాఁ జర్చించి దూరాపాస్తము కావించితిమి. అచ్చోటఁ బరికింపుఁడు.

# జీ వ న ద ర్శ న ము

శ్రీ పద్దిపర్తి చలపతిరావు

ఉ. పట్టణమందుఁ గాపురముపాల్పడి, యర్వదిరాళ్ల నౌకరీ
పుట్టగ-నద్దియున్ గలిమి పో, యని యాలుమగండ్ల మాచముల్
పట్టని యాద్రికొంప గదులన్ గదిపెట్టియలోని దిన్నె, తె
ల్లెట్టులు పిల్ల జెల్ల లోకలై, యిఱుకాటమునందు నుండెదన్.

చ. పడమటినుండి దక్షిణమువాఁకగ, వంపయి, చూకువాలుగాఁ
గడఁగిన విచ్చువాయి యడకత్తెరవాటపుఁబంచపాళినిన్
బడకకు వంటకున్ గుదుగుపాలుగఁ బాటకు కాఁపురమ్ము, బి
ట్టుడికెదు గుండ్లపై రగులుచుండెడు కుంపటి సోదె వెట్టఁగన్.

ఉ. మూలకు నట్టిటుల్ గలవు పో, కిటికీల్ చెఱిచెంప, నూకుపుం
గాలుల రాకపోకలకుఁగా, రహదారులు, వానికిన్ గులా
బీలతకూన లాని, పయిపెచ్చులుగాఁ దలలెత్తి, ముద్దులా
పూలమొగాలతో మురిసిపోవునో! నన్గని నవ్వులాడునో!

ఉ. ఆ నిలువెల్ల ముండ్లవరుసై గగురించిన పచ్చిపూపలా
మేనుల సోగతీఁగ లవి మీఁదులువోయిన నాదు యాసలన్
తేనెలు చేఁది చేఁది, దిగఁదీఁతలువోయిన తీపు లూటలై
సోనలువాఱ, నా బ్రతుకుఁ జొక్కులువెట్టును నాఁడు నేఁడుగా.

ఉ. జుమ్మనుచున్ నిగానిగలు చూపెడి ఱెప్పల ఱెక్క లాడ్చుచున్
దుమ్మెద యొక్క డాపువులతో నెకసక్కెము లాడిపోయె, నా
కమ్మని గుండెలోఁ దిగిచి కట్టిన తీఁగెలు కేఁగి, యేమిటో
నవ్వగరాని పాటలు వినంబడె, వీణియమెట్లుమీఁటుగా.

ఉ. ఆయెనొ ! లేదొ ! చెప్ప పడునంతటి యంతరమేమి, నింతలో
నా యిలువారి యూడపడు చప్పుక తారుచు వచ్చి, కొమ్మ న
ట్టే యుర వంచి గోటి కొనతేవఁ బుటుక్కునఁ బూలు త్రుంచి, యి
ట్టే యిఱికించి దూముడిని డిక్కునఁ డక్కున దూఁకె లోనికిన్.

ఉ. కొమ్మతలల్ దిగాలుపడి క్రుంగులు వోయిన కన్నెతీవ తా
గిమ్మనలేని మోవులయి కెందలిరాకులు తల్లడిల్ల, నా
సమ్ముఖమున్ గనుంగొనఁగఁ జాలక, యూతొడిమల్ పదేపదే
చెమ్మలు వాఱఁగా, సమరసీకృత యయ్యెను నాకుఁ, జెంగటన్.

ఉ. తా విట లేదు నీకు సరదాపడ, జీవనమాధవీలతా
యౌవన మాధురీ ! తొనకుఁలాడకె ! యిన్నపెనాన నీటి బొ
ట్లావిరులై పొగల్ పొగయు నట్టులె యింకులువాఱిపోదు, వీ
భూవలయంబునన్ బడినఁ బూదియ కాని మఱేది లేదిఁకన్.

ఉ. కొట్టిరి గంట ఠంగురని కోవెలలోన, నటే-తటాలునన్
దట్టెను దల్పు. నిల్పు గల దైవము "బాడుగ దే"మ్మటంచు, నా
కట్టెదుటన్ నిలంబడియెఁ గాలుని దండము నిట్టతేది-యీ
తట్టున నిల్చి పిల్లలకుఁ దప్పియు-నేవియు నింట లేవనే.

# మూఁడవ శ్రీమదాంధ్ర వేదశాస్త్రపరిషత్సభలు

## సన్మానములు

సెప్టెంబరు 1, 2 తేదీలలో కాకినాడ వేణుగోపాలస్వామివారి యాలయములో బ్రహ్మశ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రిగారి యధ్యక్షతను శ్రీమదాంధ్ర వేదశాస్త్రపరిషత్సభలు జరుపఁబడెను. బ్రహ్మశ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సభాప్రారంభము చేసిరి. కవికంఠీరవ, కవి మూర్ధన్య కాశరప్త్రి కృష్ణశాస్త్రిగారిచే స్వాగతపద్యరత్నములు చదువ బడెను. బ్రహ్మశ్రీ బులుసు అప్పన్నశాస్త్రి శ్రీ కడియాల సీతారామ శాస్త్రి శ్రీ కొల్లూరి సోమశేఖరశాస్త్రి శ్రీ రేమెళ్ళ సూర్యప్రకాశ శాస్త్రి శ్రీ జటావల్లభుల పురుషోత్తము శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రి శ్రీ కుప్పా శివరామబైరాగిశాస్త్రి వేదపురుష శ్రీ శ్రీపాద సుబ్బావధానులు శ్రీ పిడప్త్రి కృష్ణమూర్తిశాస్త్రి శ్రీ లంక నరసింహ శాస్త్రి శ్రీ వాజపేయాజుల సుబ్రహ్మణ్యశాస్త్రి వేదశాస్త్రప్రాముఖ్య తనుగూర్చి పండితపామరులకు సుబోధక మగునట్లు ఉపన్యసించిరి. సభలో బుధప్రముఖులందరు పాల్గొని జయప్రదముగా నడిపిరి. స్మార్త పరీక్ష జరిపి పట్టా లీయఁబడెను. సభలో 19 శాస్త్రపండితులు 16 ఘనాపాఠీలు 6 ఆహితాగ్నులు 140 క్రమపాఠీలు 100 మంది మధ్య తరగతివారు సన్మానింపబడిరి. పండితులకు రు 12, ఘనాపాఠీలకు రు 10, ఆహితాగ్నులకు రు 6, క్రమితలకు రు 4, మధ్యతరగతులవారికి రు 1-8-0 సన్మానములు జరిగెను. మంగళముతో సభ ముగిసెను.

కలగ వీరరాఘవులు
శ్రీమదాంధ్ర వేదశాస్త్ర పరిషత్తు
కార్యదర్శి.

# స్వాగతము

(కవియోగీన్ద్ర - కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.)

శ్లో. యా భూమతత్త్వం వివృణోతి గుహ్యాం
చతుర్మహావాక్యగుహాసు లీనం
మే వేదమాతా జనిమృత్యురూపం
సాంసారికం తాప మపాకరోతు.

భో భో వేదవేదాంగపారంగతాః !

శ్లో. భవదీయమహాపుమాకృతీ
నధునా సాద్య సభా ముపాగతా
చతురాగమభారతీ స్వయం
ఫలవత్ స్వాగతికత్వ మద్య మే.

శ్లో. మాన్యా యూయం యత్ క్షిపంతః పదాబ్జైః
ధన్యా జాతా కాకినాడాపురీ మే
ధన్యా నూనా వ్యాపినీ చాంధ్రభూమిః
ధన్యాఖండా భారతీయా ధరిత్రీ.

శ్లో. దేశే పరప్రాభవపీడ్యమానే
కుత్రా వినిక్షిప్య భవద్భి రేవ
గోపాయితం వేదచిరత్నరత్నం
జానే న జానం కథ మి త్యపర్ణమ్.

శ్లో. భో ! భో ! వేదవిదాంవరా ! శ్శుభకరాః ! కారుణ్యరత్నాకరాః !
పౌరప్రాక్తనపుణ్యలేశవశతః ప్రాప్తాః పురీం మామకాం

అర్హైర్వోపవిశంతు-సామనిగమం గాయంతు-సంసత్కృతాం
స్వీకుర్వం త్వపి సత్కృతిం తనుతమాం-తుష్యంతు భూమీసురాః

శ్లో. వేదే ఽనంతే ఽనాదా
విశ్వశ్రేయసి నిధాపితం సర్వమ్
భవతాం వేదో ఽధీనో
నో వక్తుం శక్యతే భవన్మహిమా.

శ్లో. బ్రహ్మణో నవసంఖ్యాకాః
వృథే త్యాఖ్యాయికా న చేత్
అసంఖ్యాకా ముఖాంభోజ
వాగ్దేవికా వసం త్యమీ.

శ్లో. యాఽస్మాకీన మహామఖాచరణత స్సస్యానుకూలం పయః
పర్జన్యః పరితోఽభివర్ష తు-జనా జీవంతు సౌఖ్యాన్వితాః
దీర్ఘాయుర్ధనధాన్యభోగకలనాభోగై-స్సదా పాల్యతాం
ధీమన్మంత్రిభి రాస్తికై రభినవై శ్రీభారతీయావనీ.

1-9-1956,
కాకినాడ నగరీ.

ఏవం వినీతః స్వాగతికశ్చ
కా. కృ. శాస్త్రీ.



# రచయితలకు విజ్ఞప్తి

ఆంధ్రసాహిత్య పరిషత్పత్త్రికలో ప్రచురించుటకు మీచేఁ బంపఁబడు వ్యాసములను-పద్యములను గ్రాంథికభాషలోననే విరచించి, విడియక్కరములతో విసంధులు లేకుండునట్లుగ పత్త్రమున కొకవైపుననే లిఖించి సకాలమున మా పరిషత్కార్యాలయమునకుఁ జేరునట్లు పంపఁగోరెదము.

అమూల్యములగు మీ గద్య పద్య కవితలచే నాంధ్రశారదాదేవి నారాధించి భాష నుద్ధరింప రచయితృ మహాశయులు పౌనఃపున్యముగఁ బ్రార్థితులు.

ఇట్లు

సంపాదకుఁడు.

वेदान्तिनां, मतानि प्रत्युक्तानि भवन्ति । तथाहि । चार्वाकास्तु निर्हेतुक मिदं जगत् कण्टकतैक्ष्ण्यादिवत् स्वभावादेव सिध्यतीति वदंति । वैशेषिकादयः नित्याननित्यांश्च भावानभ्युपगच्छन्ति । भावमात्रस्य सहेतुकत्वक थनेनैतानि मतानि प्रत्युक्तानि भवन्ति । यथोक्तप्रतीत्य समुत्पाददर्शने सत्यमार्याणा मभिधेयादिलक्षणस्य प्रपञ्चस्य सर्वथैवोपरमात् प्रपञ्चस्योपशमोऽस्मिन् सतीति व्युत्पत्या स एव प्रतीत्यसमुत्पादो प्रपञ्चोपशम इत्युच्यते । एवं चित्तचैत्यानामप्रवृत्तौ ज्ञानज्ञेयव्यवहारनिवृत्तिः । ततश्च जाति जरामरणादि निखिलोपद्रव निवृत्ति रिति स एव शिव इत्युच्यते । अत्र च निरोधस्य प्रथमं प्रतिषेधः, उत्पादनिरोधयोः पौर्वा पर्य-नियमो नास्तीति सूचयितुं, अतएव वक्ष्यति पूर्वं "जाति यदि भवे" दित्यादि । ततश्च नायं नियमः । पूर्वमुत्पादेन भवितव्यं, पश्चान्निरोधेनेति । निरोधो नाम क्षणभंगः । उत्पादन मुत्पादः । आत्म लाभ इति यावत् । उच्छेदोनाम प्रबन्धविच्छेदः । शाश्वतः सर्वकालस्थायी । एकार्थो नामाभिन्नार्थः । भिन्नार्थ एव नानार्थः । आगति रागमनम् । निर्गतिर्निर्गमनम् । प्रतीत्य शब्दः, प्राप्त्य-पेक्षायां च वतते । समुत्पूर्वः पदिः प्रादुर्भावे । तथाच हेतुप्रत्यय सापेक्षः, भावाना मुत्पादः, प्रतीत्यसमुत्पाद इत्युच्यते ।

केचित्तु प्रतिर्वीप्सार्थः, इत्यशब्दः तद्धितान्तः विनाशा-र्थकः, तथा च प्रति क्षणविनाशिनां समुत्पादः प्रतीत्यसमुत्पाद इति वर्णयन्ति ।

अन्ये तु प्रतिर्वीप्सार्थः, एतिःप्राप्त्यर्थः, तथाच तांस्तान् प्रत्ययान् प्राप्य भावानां समुत्पादः, प्रतीत्यसमुत्पाद इति वदन्ति । सर्वथापि सकारणभावोत्पत्तिं न व्यभिचरति प्रतीत्य-समुत्पादः ।

ननु चोत्पादादीनां प्रतिषेधं, सर्वधर्माणां शून्यत्व प्रति-पादनार्थ मारब्धवानाचार्यः । सति चैवं, यन्मृषा न तदस्तीति,

न सन्त्यकुशलानि कर्माणि, तदभावान्न सन्ति दुर्गतयः, एव न सन्ति कुशलानि कर्माणि, तदभावान्न सन्ति सुगतयः, तयोरभावान्नास्ति संसारः, तथाच सर्वारंभवैयर्थ्यं प्राप्नोति। संवृतिसत्यापेक्षया सत्याभिनिवेशिनो लोकस्येयं मृषार्थता भावानाऽभ्युपविश्यतेऽस्माभिः। न चैते कृतकृत्या आचार्याः, परमार्थतः किंचित् पश्यन्ति, यन्मृषा वा, अमृषा वा स्यात्। अपिच येन हि सर्वधर्माणां मृषात्वं परिज्ञातं, न तस्य संसारः कर्माणि वा सन्ति। नाप्यसौ कस्यचिद्धर्मस्यास्तित्वं, नास्तित्वं वा पश्यतीति न तस्योपदेशोयम्। यस्तु मायानाटके मायानिर्मितां स्त्रियं दृष्ट्वा रक्तो भवति, ततश्च तामेव स्त्रियं मनसि कृत्वा तच्चिन्ताक्रान्तमानसः दुःख मनुभवति। तादृशं पुरुष मुद्दिश्यायमाचार्याणा मुपदेश इत्यलम्। वस्तुतस्तु यः प्रतीत्यसमुत्पादः शून्यतां, तां प्रचक्ष्महे इति वक्ष्यमाणरीत्या शून्यतैव प्रतीत्य समुत्पादः। तस्याश्चानिरोधादिकं सर्व मुपपद्यत एव।

इदानी मनिरोधादिविशेषणविशिष्ट प्रतीत्य समुत्पाद प्रतिपिपादयिषया, उत्पाद प्रतिषेधेन निरोध प्रतिषेधे सौकर्यं मन्यमानः आचार्यः प्रथम मुत्पादप्रतिषेध मारभते। 'न स्वत' इत्यादिना तत्रपरैः परिकल्प्यमानः उत्पादः स्वतो वा कल्प्यते, उत परतः, उभाभ्याम्, आहोस्वि दहेतुकः कल्प्यते। सर्वथापि नोपपद्यते। तथाहि।

न स्वतो नापि परतः न द्वाभ्यां नाप्यहेतुतः
उत्पन्ना जातु विद्यन्ते भावाः क्वचन केचन॥ १

अत्र जातिशब्दस्य कदाचि दित्यर्थः। क्वचनशब्दः आधारपरः। ततश्च स्वतः उत्पन्ना भावाः, नैव जातु विद्यन्ते क्वचन

केचनेति सम्बन्धः। एवं प्रतिज्ञात्रयमपि योजनीयम्। नैव स्वत उत्पद्यन्ते भावाः। कुतः, – "तस्माद्धि तस्य जनने, न गुणोऽस्ति किञ्चित्। जातस्य जन्म पुनरेव च नैव युक्तम्" इत्यादिना अन्यत्र दूषितत्वात्। ननु भावानां स्वतः उत्पत्ति प्रतिषेधे परतः उत्पत्तिः प्राप्नोतीति चेन्न प्राप्नोति। कथम्। परस्यैवाभावात्। एतच्च "नहि स्वभावो भावानां प्रत्ययादिषु विद्यते, स्वभावे ऽविद्यमाने तु परभावः कुतो भवेत्।" इत्यत्र प्रतिपादयिष्यते। किञ्च, 'अन्यत् प्रतीत्य यदि नाम परो भविष्य, ज्जायेत तर्हि बहुलः शिखिनोऽन्धकारः। सर्वस्य जन्म च भवेत्खलु सर्वतश्च, तुल्यं परत्व मखिले जनकेपि यस्मात्" इत्यदिना अन्यत्रापि परतः भावाना मुत्पत्ते दूषितत्वाच्च। द्वाभ्यामपि नोत्पद्यन्ते भावाः। उभयपक्षोक्तदोषानतिलंघनात्। "स्या दुभाभ्यां कृतं दुःखं। स्या देकैककृतं भवेत्" इत्यत्र दूषितत्वाच्च। "अहेतुतोऽपि नोत्पद्यन्ते भावाः। हेता वसति कार्यं च कारणं च न विद्यते" इत्यादिना वक्ष्यमाण प्रकारेण दूषणप्रसंगात्। किञ्च। गृह्येत नैव च जगद्यदि हेतुशून्यं स्याद्यद्वदेव गगनोत्पलगन्धवर्णा" वित्यादिना अन्यत्रोक्तदोषप्रसंगाच्च।

ननुस्वतः, द्वाभ्यां, अहेतुतः, भावा नोत्पद्यन्ते, इति यदुक्तं तदङ्गीक्रियते। यदपि परतोऽपि भावा नोत्पद्यन्ते इति तदयुक्तं। कुतः भगवता परभूता एव भावाना मुत्पादकाः निर्दिष्टः। तथाहि।

चत्वारः प्रत्यया हेतु श्चालंबन मनन्तरम्
तथैवाधिपतेऽयं प्रत्ययो नास्ति पञ्चमः २

निर्वर्तको हेतु रिति लक्षणात् योहि यस्य निर्मतकः स तस्य हेतुप्रत्ययः यथा बीज मंकुरस्य, उत्पद्यमानो भावः,

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

## ప్రతిష్ఠాపకులు :

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు
సి. బి. ఇ. డి. లిట్., పిఠాపురము మహారాజులుంగారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
(జమీందారు - ఉయ్యూరు ఎస్టేటు)

## అధ్యక్షులు :

"మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమేత్యాదిబిరు
దాంకితు లగు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

## కార్యదర్శులు :

సాహిత్య శిరోమణి, ఉభయభాషాప్రవీణ, శ్రీ చతుర్వేదుల
సత్యనారాయణగారు ఎం. ఏ. బి. ఒ. యల్.

శ్రీమాన్ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి ఏ., యల్.యల్.బి.

## కోశాధ్యక్షులు :

శ్రీమాన్ ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి. ఏ., యల్.యల్.బి.

## కార్యనిర్వాహకవర్గము :

శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు.

శ్రీ రా. సా. మాదిరెడ్డి సీతారామయ్యగారు, బి. ఏ, బి. యల్.

శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎం. ఏ. (ఆనర్సు) బి. ఇడి.

శ్రీ భమిడిపాటి సూర్యనారాయణశర్మగారు.

వ్యాకరణ విద్యాభాషాప్రవీణ, శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు.

శ్రీ కవికంఠీరవ, కవిమూర్ధన్య కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు.

ఐతిహాసిక సమాశ్రిట్ శ్రీ బండారు తమ్మయ్యగారు.

భాషాప్రవీణ శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు.

మధురకవితావిశారద,
శ్రీ ఎండమూరి వేంకటరమణగారు, యం. ఏ., బి. ఇడి.

శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు.